# దైవ చిత్తం

(శ్రీ ఏ.సి.పి.శాస్త్రి గారి "The Mind Of God"కు స్వేచ్ఛానువాదం)

గబ్బిట దుర్గాప్రసాద్

ప్రచురణ:

సరసభారతి

ఉయ్యూరు, కృష్ణాజిల్లా

# DAIVA CHITTAM

**Telugu Translation to Sri A.C.P.SASTRY**
**"THE MIND OF GOD"**
by
**Gabbita Durga Prasad**


First Edition: **APRIL 2016**

Copies: 1000





Price. Rs.**80/-**

Cover Design: **Kalasagar**



For Copies: **Gabbita Durga Prasad**
President, "Sarasabharathi"
H.No.2-405, Sivalayam Street,
Near Raja gari kota, Vuyyuru- 521 165
Krishna Dist. Phone:08676- 232797
Cell: 9989066375
e-mail: gabbita.prasad@gmail.com
sarasabharati.vuyyuru@gmail.com
http/sarasabharati.wordpress.com
http/suvarchalanjaneyaswamy.wordpress.com



Type Setting: **"Ramya Bharathi"** vja

Printed : **Rainbow Graphics,** vijayawada-2

# అంకితం



సౌజన్యశీలి, సహృదయులు, ఆత్మీయులు

శ్రీ మైనేని గోపాలకృష్ణ గారికి ప్రేమతో...

# శ్రీ మైనేని గోపాలకృష్ణ గారి గురించి...

**జననం- విద్యాభ్యాసం**

శ్రీ మైనేని గోపాలకృష్ణగారు కృష్ణాజిల్లా ఉయ్యూరుకు సమీపంలోని కుమ్మమూరు గ్రామంలో శ్రీ మైనేని వెంకట నరసయ్య, శ్రీమతి సౌభాగ్యమ్మ దంపతులకు 10-1-1935న ఆరవ సంతానంగా జన్మించారు. వీరి అన్నగార్లు స్వర్గీయ సూర్యనారాయణ, స్వర్గీయ తాతయ్య అనే రాజశేఖర్, అక్కయ్యలు శ్రీమతి అన్నపూర్ణాదేవి, స్వర్గీయ కనకదుర్గాదేవి, శ్రీమతి భారతీదేవి. చెల్లెళ్ళు శ్రీమతి హేమలతా దేవి , శ్రీమతి సత్యవాణి. బాల్యంలోనే పిల్లల చదువుకోసం తండ్రిగారు కుటుంబాన్ని ఉయ్యూరుకు మార్చారు. ప్రాథమిక విద్యను గోపాలకృష్ణగారు కీ.శే. కోట సూర్యనారాయణ శాస్త్రిగారి వద్ద నేర్చారు. కోట మాస్టారు అంటే మైనేని వారికి అమితమైన గౌరవం, భక్తీ. వారి పేరు చెబితే పులకించిపోతారు. 1950 వరకు తాడంకి స్కూల్‌లో చదివి ఎస్.ఎస్.ఎల్.సి. పాసై, తరువాత విజయవాడ ఎస్.ఆర్.ఆర్.కాలేజీలో ఇంటర్ చదివి 1954లో ఉత్తీర్ణులయ్యారు. కొంతకాలం నాటకాలు, సోషలిస్ట్ పార్టీ సభలతో కాలేజీకి డుమ్మా కొట్టారు. బెజవాడ హోటల్ వర్కర్స్ యూనియన్‌తో చేరి, వర్కర్ల జీవన పరిస్థితులను మెరుగు పరచటానికి, వారిని యాజమాన్యం గౌరవంగా చూడటానికి కృషి చేశారు.

**ఉన్నత విద్య- వివాహం- మొదటిసారి అమెరికా ప్రయాణం**

1953-54లో ఉయ్యూరులో డ్రమెటిక్ అసోసియేషన్ స్థాపించి ఆత్రేయగారి యెన్.జి.ఓ నాటికను ప్రాక్టీస్ చేశారు. 1955-58 కాలంలో విశాఖ ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ఫిలాసఫీ మెయిన్ సబ్జెక్ట్‌గా ఎడ్యుకేషనల్, సోషల్ అండ్ చైల్డ్ సైకాలజీ మైనర్ సబ్జెక్టులుగా తీసుకొని చదివి 1959లో ఎం.ఏ.

సెకెండ్ క్లాస్‌లో పాసైనారు. 1960లో గుంటూరు జిల్లా రేపల్లె తాలుకా నల్లూరు గ్రామవాసి కీ.శే. పరుచూరి భావనారాయణ చౌదరి, శ్రీమతి రత్న మాణిక్యమ్మ దంపతుల కుమార్తె శ్రీమతి సత్యవతిని వివాహం చేసుకొన్నారు. 1960–61లో అమెరికా వెళ్ళి మిన్నియా పోలీస్‌లోని మిన్నె సోటా యూనివర్సిటీలో ఎడ్యుకేషనల్ సైకాలజీ, స్టాటిస్టిక్స్‌లో కొంత కోర్సు వర్క్ చేశారు. "ఫాదర్ ఆఫ్ క్రియేటివిటి" అని అందరూ గౌరవంగా పిలుచుకొనే డాక్టర్ పాల్ ఇ టారెన్సే– బ్యూరో ఆఫ్ ఎడ్యుకేషనల్ రిసెర్చ్‌కు అధిపతిగా ఉండి సృజనను బాగా ప్రోత్సహించేవారు. గోపాలకృష్ణ గారు 1961–62లో మాడిసన్‌లోని విస్కాన్సిస్ విశ్వ విద్యాలయంలో ఇండియన్ స్టడీస్‌కు అనుబంధంగా ఉన్న తెలుగు గ్రంథాలను కేటలాగ్ చేయటానికి సహాయ పడుతూ, కొన్ని లైబ్రరీ కోర్సులు పూర్తిచేశారు. 1962లో ఇండియా తిరిగి వచ్చి కొంతకాలం చిరు ఉద్యోగాలు చేస్తూ, కొంతకాలం నిరుద్యోగిగా ఉంటూ, కొంతకాలం ఉయ్యూరు కే.సి.పిలో అతి చిన్న ఉద్యోగం చేసి, స్థిరమైన రాబడి లేక, కుటుంబాన్ని పోషించలేక ఇబ్బంది పడుతూ మంచిరోజుల కోసం ఎదురుచూస్తూ 1968 వరకు ఆరేళ్ళు గడిపారు.

### తలపు తట్టిన అదృష్టం– లైబ్రరీ సైన్స్ కోర్స్– ఉద్యోగం

అదృష్టం తలుపుతట్టగా 1969లో అమెరికా వెళ్ళి టెన్నీసిలో లైబ్రరీ సైన్స్‌లో ఎం.ఏ.చేసి అందరి ఆదరాభిమానాలు పొంది, డిగ్రీ తీసుకొని సంతృప్తి చెందారు. సుమారు ఏడేళ్ళు పడిన మానసిక వేదనకు, శారీరక శ్రమకు విముక్తి కలిగింది. కోర్సులో ఉండగానే కెంటకీలోని లూయీవిల్ యూనివర్సిటీలో కేటలాగర్ అండ్ ఇన్‌స్ట్రక్టర్ ఇన్ లైబ్రరీ సైన్స్‌కు ఎంపికై, పదవీ బాధ్యతలు చేపట్టారు. న్యూయార్క్ పబ్లిక్ లైబ్రరీ, వాషింగ్టన్‌లో లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్ మరియు ఇతర విశ్వ విద్యాలయాల రిసెర్చ్ గ్రంథాలయాలను సందర్శించారు. మెషీన్ రీడబుల్ కేట లాగింగ్‌కు ఇన్ హౌస్ ట్రెయినింగ్ ఇచ్చారు. ఆంగ్లో అమెరికన్ కేటలాగింగ్ రూల్స్‌పై వర్క్‌షాప్ నిర్వహించారు. ఆబ్ స్ట్రాక్ట్ ఆఫ్ అకడెమిక్ ప్లాన్ అండ్ బిల్డింగ్ ప్రోగ్రాంకు సహకరించారు. లాంగ్ రోల్ బడ్జెట్, పర్సనల్ అండ్ రిసోర్సెస్ ప్రొడక్షన్‌కు

సహాయకుడిగా సేవలందించారు. యూనివర్సిటి ఆఫ్ లూయీవిల్ లైబ్రరీ సిస్టంకు టెక్నికల్ సిస్టం అందించటంలో ప్రముఖ పాత్ర పోషించారు. మైనేనిగారి బాస్ ప్రోత్సాహంతో కేటలాగింగ్ కన్సల్టెంట్‌గా పోర్ట్ నాక్స్ యునైటెడ్ స్టేట్స్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ డిఫెన్స్ లైబ్రరీలో 1974 నుంచి 76 వరకు రెండేళ్ళు, నేషనల్ ఆర్కైవ్స్, సన్స్ ఆఫ్ అమెరికన్ రివల్యూషన్‌లో 1976– 78 వరకు, కెంటకీలోని లూయీవిల్‌లో ఉన్న లైబ్రరీ ఆఫ్ వరల్డ్ ఫెయిత్స్ సెంటర్‌లో 1980–82 వరకు వ్యవహరించారు. తనపై బాస్‌కున్న నమ్మకానికి ఎంతో కృతజ్ఞత చూపిస్తారు శ్రీ గోపాలకృష్ణ. పై ఉద్యోగుల చేత ప్రశంసలు, సహోద్యోగుల చేత ఆత్మీయ మిత్రులుగా అభినందనలు పొందారు. 1997లో అసోసియేటెడ్ ప్రొఫెసర్ అండ్ స్పెషల్ అసిస్టెంట్ టు యూనివర్సిటి లైబ్రేరియన్‌గా పదవీ విరమణ చేశారు.

**కుటుంబం**

మొదటి నుండి సత్యం, ధర్మం, న్యాయంలపై మక్కువ ఉన్న గోపాలకృష్ణ గారు కెంటకీ సదరన్ బాప్టిస్ట్ దియలాజికల్ సెమినరి, ముర్రె స్టేట్ యూనివర్సిటీలో హిందూ ధర్మంపై ప్రసంగాలు చేశారు. లూయీవిల్ యూనివర్సిటీలో రెలిజియన్ స్టడీ డిపార్ట్‌మెంట్ ఆహ్వానంపై బౌద్ధ ధర్మంపై ధార్మికోపన్యాసమిచ్చి అందరి మనన్నలు అందుకొన్నారు. అతిధులను గౌరవంగా ఆదరించటం, బాధితులకు సానుభూతి సహవేదనలను చూపటం మైనేని వారికి తలిదండ్రుల నుండి సంక్రమించిన గొప్ప సుగుణం. గోపాలకృష్ణ దంపతులకు ఇద్దరు కుమారులు. పెద్దకుమారుడు శ్రీ కృష్ణ– కోడలు శ్రీమతి రమ. మనుమరాళ్ళు చి॥ శ్రేయ, సెరీన. చిన్న కుమారుడు శ్రీ రవి. కోడలు శ్రీమతి కవిత. మనుమడు చి॥ కిరణ్. మనుమరాళ్ళు చి॥ రియా, కరీనా. మన సాంప్రదాయ ప్రకారం వివాహాలు చేసుకొని సంతానం పొంది, అమెరికాలోనే తాము ఎంచుకొన్న వృత్తిలో రాణిస్తూ, తలిదండ్రులను కనిపెడుతూ ఆదర్శంగా ఉంటూ సంతోష పెడుతున్నారు. గోపాలకృష్ణ గారి భార్య శ్రీమతి సత్యవతిగారితో అనుకూల దాంపత్యం వలన సుఖ సౌఖ్య ఆనందమయ జీవితాన్ని గడుపుతున్నారు.

**ఉయ్యూరుపై అభిమానం- వితరణ**

అమెరికాలో ఉన్నా గోపాలకృష్ణ గారికి ఉయ్యూరుపై అభిమానం, మమకారాలు ఏ మాత్రమూ తగ్గలేదు. ఇక్కడి విషయాలు ఎప్పటికప్పుడు తెలుసుకొంటూనే ఉంటారు. దక్షిణ భారతదేశంలోనే మొట్టమొదటిసారిగా ఏర్పడిన ఉయ్యూరు ఏ.సి.లైబ్రరీకి వారి తలిదండ్రులు కీ॥ శే॥ మైనేని వెంకట నరసయ్య, శ్రీమతి సౌభాగ్యమ్మ గార్ల పేరు మీద 5 లక్షల రూపాయలు భూరి విరాళం అందజేశారు. మచిలీపట్నం కృష్ణా విశ్వ విద్యాలయానికి ఇరవై వేల రూపాయలు, భగవద్గీతలో రాణిస్తున్న చి॥ మాదిరాజు బిందుదత్తశ్రీకి ఉన్నత విద్యాభ్యాసం కోసం 15 వేల రూపాయలు, ఉయ్యూరులోని హిందూ స్మశానవాటిక (స్వర్గపురి)ని ఆధునీకరిస్తూ అభివృద్ధి చేస్తున్న ఉయ్యూరు రోటరీ క్లబ్ వారికి 25 వేల రూపాయలు, తమ ప్రియతమ గురువులు స్వర్గీయ కోట సూర్యనారాయణశాస్త్రి గారి స్మారక నగదు పురస్కారాన్ని ఏర్పాటుచేసి ఇద్దరు అతిపేద ప్రతిభగల విద్యార్థులకు ఒకొక్కరికి 10 వేల రూపాయల 2014, 2015 సంవత్సరాలలో అందజేసిని వితరణశీలి శ్రీ గోపాలకృష్ణగారు.

**పెద్దల యెడల గౌరవం**

పెద్దలను ఎలా గౌరవించి సత్కరించాలో గోపాలకృష్ణ గారిని చూసి మనం నేర్చుకోవాలి. ప్రపంచ ప్రసిద్ధ ఆర్థికవేత్త ఉయ్యూరు వాసి, ప్రస్తుతం అమెరికా నివాసి శ్రీ ఆరిగపూడి ప్రేమ్‌చంద్ గారిని ఉయ్యూరు రప్పించి, ఖర్చు అంతా భరించి వారికి మాతో ఘనసన్మానం చేయించి ఆనందించారు. భౌద్ధధర్మ ప్రచారకులు శ్రీ అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి గారికీ ఇలాగే గొప్ప సత్కారం చేయించారు. బాపు రమణలు అంటే గోపాలకృష్ణ గారికి అమితమైన ఆరాధనా భావం. బాపు- రమణల స్మారక నగదు పురస్కారాన్ని మొట్టమొదటిసారిగా ఏర్పాటుచేసి ప్రముఖ కథకులు శ్రీ వేదగిరి రాంబాబు గారికి అయిదువేలు, ప్రఖ్యాత చిత్రకారులు, కవి శ్రీ శీలా వీర్రాజు గారికి 10 వేల రూపాయలు అందజేసారు. ప్రముఖ కథకులు శ్రీ కాళీపట్నం రామారావు గారు నిర్వహిస్తున్న “కథానిలయం”కు 15వేల రూపాయలు, ప్రఖ్యాత ఆధ్యాత్మిక గురువులు, సాహిత్య సాంస్కృతిక,

ధార్మిక కార్యక్రమ నిర్వాహకులు స్వర్గీయ సద్గురు శివానందమూర్తిగారి "సనాతన ధర్మ ఛారిటబుల్ ట్రస్ట్"కు 11,116/- రూపాయలు అందజేసిన సంస్కారి. ఇవన్నీ వారు అమెరికాలో ఉంటూ సరసభారతి చేత చేయించిన సత్కారాలు, సత్కార్యాలు.

తన జీవితానికి మార్గదర్శి, స్నేహితులు, ఆత్మీయులు అయిన శ్రీ కోగంటి సుబ్బారావు గారికి 11-1-2015న నభూతోగా సరసభారతి చేత సన్మానం చేయించి ఆ కుటుంబంలోని వారందరికీ నూతన వస్త్రాలు కొనిపించి, అందజేయించి మొత్తం ఖర్చు తానే భరించిన సజ్జన హృదయులు శ్రీ గోపాలకృష్ణ. 70 ఏళ్ళ క్రితం ప్రాథమిక విద్యను నేర్పిన గురుదేవులు కీ.శే. కోట సూర్యనారాయణశాస్త్రి గారిని మర్చిపోక, వారి కుమారుల చిరునామాలు సేకరించి ఫోన్‌లో మాట్లాడి 5-9-15 ఉపాధ్యాయ దినోత్సవం రోజున వారందరినీ సకుటుంబంగా ఆహ్వానించి గురువుగారి చిత్రపటాన్ని ప్రముఖ ఆర్టిస్ట్ టి.వి.ఎస్.బి.శాస్త్రి (ఆనంద్) చేత చిత్రింపజేసి, శాసనమండలి సభ్యులు శ్రీ వై.వి.బి.రాజేంద్రప్రసాద్‌తో ఆవిష్కరింపజేసి, శ్రీమతి సింగరాజు కల్యాణీ, శ్రీమతి కాళీపట్నం ఉమా గార్లచే సంగీత కచేరీ జరిపించి గురుపూజోత్సవంగా సరసభారతి చేత ఘనంగా నిర్వహింపజేయించి, వారందరికీ నూత్న వస్త్రాలు అందజేయించి కార్యక్రమాన్ని ప్రత్యక్ష ప్రసారం చేయించి అమెరికాలో చూసి తన్మయం చెంది, తన జన్మ చరితార్థమైనదని సంతృప్తి చెందిన ఆదర్శవ్యక్తి శ్రీ గోపాలకృష్ణగారు.

**సరసభారతికి ఆత్మీయులు**

సరసభారతికి పరమ ఆత్మీయులు శ్రీ గోపాలకృష్ణగారు. తాను స్పాన్సర్‌గా ఉండి, నా రచనా, సరసభారతి ప్రచురణలు అయిన "సిద్ధయోగ పుంగవులు", "మహిళా మాణిక్యాలు", "పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు", "దర్శనీయ దైవక్షేత్రాలు" గ్రంథాలను వరుసగా తమ తల్లిగారు కీ.శే.మైనేని సౌభాగ్యమ్మ గారికి, తమ ప్రియతమ అర్ధాంగి శ్రీమతి మైనేని సత్యవతి గారికి, తమ బావగారు డా. శ్రీ రాచకొండ నరసింహశర్మ-ఎం.డి గారికి, తనకు మార్గదర్శి, మెంటార్ అయిన కోగంటి సుబ్బారావుగారికి అంకితమిప్పించి, వారిపై తనకున్న గౌరవ ఆత్మీయ

అనురాగాలను, కృతజ్ఞతను చాటుకొన్న ఉదార హృదయులు మైనేని వారు. అందుకనే వారికి తెలియకుండా “గీర్వాణ కవుల కవితా గీర్వాణం” అనే బృహత్ గ్రంథాన్ని శ్రీ గోపాలకృష్ణ గారికి ఆన్‌లైన్‌లో అంకితమిచ్చి నా ఋణం తీర్చుకొన్నాను. ఈ పుస్తకాన్ని అమెరికాలో ఉంటున్న వారి మేనకోడళ్ళు, మేనల్లుడు స్పాన్సర్ చేసి సరసభారతి చేత ముద్రింపజేసి, తమ ప్రియతమ “కృష్ణ మామ” ఆదరాన్ని, ఆశీస్సులను అందుకొన్నారు.

## దైవ చిత్తం ప్రాయోజకులకే అంకితం

నాపై శ్రీ గోపాలకృష్ణ గారికి అమితమైన ఆత్మీయత, అనురాగం ఉన్నాయి. ఎన్నో అమూల్యమైన గ్రంథాలు నేను చదవాలని భావించి, కొని, పోస్ట్‌లో పంపుతూనే ఉన్నారు. నా పుట్టినరోజు పండుగనాడు, “గీర్వాణం” ఆవిష్కరణ రోజున వారు అందజేసిన బహుమానాలు “అమూల్య”మైనవి.. నేనెప్పుడూ ఋణం తీర్చుకోలేనివి. వారి అవ్యాజానురాగానికి కృతజ్ఞతలు. దైవభక్తి, పెద్దల యెడల గౌరవం, సనాతన ధర్మంపై అభిమానం, ఆచరణలో శుద్ధ మనస్కత, సర్వజనుల సౌభాగ్య చింతనాశీలి ఆయన... “దైవ చిత్తం” గ్రంథానికి స్పాన్సర్‌గా తానే ఉండాలి అని ముందుకొచ్చిన శ్రీ మైనేని గోపాలకృష్ణ గారికి అంకితమివ్వటం సముచితం అని భావించి, సరసభారతికి వారిపై ఉన్న గౌరవాదరణలకు నిదర్శనంగా మనస్ఫూర్తిగా, చంద్రునికొక నూలుపోగుగా వారికి అంకితమిస్తున్నాను.

**– గబ్బిట దుర్గాప్రసాద్**



శ్రీ అందుకూరి చిన పున్నయ్య శాస్త్రి, శ్రీమతి లక్ష్మీ కళ్యాణి దంపతులు

# శ్రీ ఎ.చిన పున్నయ్యే అయినా పెద్ద పూర్ణ ప్రజ్ఞ శాస్త్రి

**72** ఏళ్ళ వయసులో కంచు ఘంటలాంటి స్వరంతో వేదం నుంచి వేమన దాకా మాట్లాడగల నేర్పూ, శాస్త్రం నుంచి శాస్త్రీయ దృక్పథాన్ని పిండగల ఓర్పూ, సంగీతాంబోధిని తరచి అనర్ఘ రత్నాలను వెలికితీసే పరిశీలనా, ఏది చెప్పినా, మాట్లాడినా రుషిప్రోక్తంగా భాసింపజేసే వాక్కు, నాటక రచనలో సిద్ధహస్తం, భువన విజయ "భట్టు మూర్తిమత్వం" వృత్తి రిజర్వ్ బాంక్ ఉద్యోగమే కాని ప్రవృత్తి సాహిత్య సంగీత ర(రా)సమయంగా సార్ధకంగా జీవిస్తున్న పెద్దలు శ్రీ అందుకూరి చిన పున్నయ్య శాస్త్రి. ఈ డిసెంబర్ 19వ తేది మధ్యాహ్నం ఫోన్‌లో వారితో పరిచయమవ్వటం వారి సౌజన్యానికి ముగ్ధడనవటం, వారూ నేను కలుసుకోవాలనుకోవటం 20-12-15 ఆదివారం సాయంత్రం బాచుపల్లి నుంచి బయల్దేరి 4గంటలకు పంజాగుట్టలోని వారి స్వగృహంలో నేనూ మా అబ్బాయిలు శాస్త్రి, శర్మలతో కలిసి వెళ్ళి దర్శించటం వారు అన్నట్లు పరిచయమైన 36 గంటలలోనే ఆయనను కలిసిన

మొదటి వ్యక్తిగా నేను రికార్డ్ సృష్టించటం తమాషాగా ఉంది. వారి ఫోన్ నంబరు నాకు ఇచ్చి మాట్లాడమని శుక్రవారం సాయంత్రం నాకు ఫోన్ చేసి చెప్పి ప్రోత్సహించిన పొన్నూరు సంస్కృత కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్ శ్రీ తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారి అమృత హృదయానికి ఎన్ని కృతజ్ఞతలు చెప్పినా చాలదు. శ్రీ పున్నయ్య శాస్త్రి బహుముఖ ప్రజ్ఞను సాహితీ బంధువులకు తెలియ జేయాలనే సంకల్పమే ఈ వ్యాసం.

శ్రీ అందుకూరి చిన పున్నయ్య శాస్త్రిగారు అంటే ఎవరికీ తెలియదు. కాని ఏ.సి.పి.పి.శాస్త్రి గారు అంటే అందరికీ తెలుస్తుంది. అదీ వారి పేరులోని మహత్తు. 19-1-1944న శ్రీ అందుకూరు వెంకట సుబ్బయ్య, శ్రీమతి అచ్చమాంబ దంపతులకు జన్మించారు. బి.ఏ.డిగ్రీ పొంది రిజర్వ్ బ్యాంక్‌లో ఉద్యోగించి అంచలంచలుగా ఎదిగి అసిస్టెంట్ మేనేజర్‌గా 2003 సెప్టెంబర్‌లో పదవీ విరమణ చేశారు.

సంగీతంలో విశేష అభిమానం ఉన్న శాస్త్రిగారు హైదరాబాద్ రాంకోఠి ప్రభుత్వ కళాశాలలో 1968 చేరి కర్నాటక సంగీతం నేర్చి "సంగీత భూషణ్" అయ్యారు. తను నేర్చిన సంగీతాన్ని సార్ధకం చేస్తూ హైదరాబాద్ ఆకాశవాణి కేంద్రం వారు ప్రారంభించిన యువవాణి సంగీత కార్యక్రమాలకు తన ప్రతిభా సామర్ధ్యంతో సార్ధకత చేకూర్చారు. అనేక సభలలో, దూరదర్శన్‌లో సంగీత గేయాలకు స్వర రచన చేశారు. "హం ఏక్ హై" అనే హిందీ గేయ నాటికకు సంగీత రచన చేశారు. తెలుగు కూచిపూడి గేయ నాటిక "మహాశ్వేత"కు అనేక సంవత్సరాలు సంగీత రచన చేసి నాటిక విజయానికి ఎంతగానో తోడ్పడ్డారు. దీని రచయిత కీ.శే. పి.వి.వి.రోహిణీకుమార్, నృత్య దర్శకులు సరళాకుమారి. ఈ త్రయం మహాశ్వేతను సాహిత్య సంగీత నృత్య త్రివేణీ సంగమం చేసింది. 1998లో "అష్టలక్ష్మి వైభవం"కు రచనా, సంగీతం సమకూర్చి వైభవం తెచ్చారు. ఇది హైదరాబాద్ దూరదర్శన్ కేంద్రం నుండి దీపావళి ప్రత్యేక కార్యక్రమంగా ప్రసారమైంది. దీనికి నిర్దేశకులు ప్రముఖ నృత్య దర్శకురాలు డా. శ్రీమతి జొన్నలగడ్డ అనూరాధ శాస్త్రిగారి "సర్వమత గేయ నాటిక" గొత్తగూడెం రేడియో స్టేషన్ నుండి

ప్రసారమైంది. హైదరాబాద్ కేంద్రం శాస్త్రిగారి రచన "సంగీత కళానిధి భట్టుమూర్తి" ని 2004లో ప్రసారం చేసి భట్టుమూర్తికవిలోని సంగీతజ్ఞతను శ్రోతలకు అందజేసింది.

శాస్త్రిగారి రచనలు చాలాభాగం "రుషిపీఠం", "మూసీ" పత్రికలలో ప్రచురితాలు. వైదిక సాహిత్య విషయాలపై శాస్త్రిగారు ఎన్నో విజ్ఞానదాయక వ్యాసాలూ రచించి అందులోని నిగూఢ భావాలను తేలతెల్లంగా జనసామాన్యానికి తెలియజేశారు, చేస్తున్నారు. "కచ-దేవయాని" కథను "విద్యా మహిమ" పేరుతో రచించారు. సీతా కల్యాణం గేయ నాటిక రాశారు. భువన విజయంలో శాస్త్రిగారు దాదాపు పాతిక ఏళ్ళుగా "భట్టుమూర్తి కవి" పాత్రను రసరమ్యంగా పోషిస్తూ ప్రేక్షకాభిమానాన్ని సంగీత రసజ్ఞుల మెప్పును పొందుతున్నారు. శాస్త్రిగారి "మిత్ర లాభం" పద్య కావ్యం అముద్రితం.

శాస్త్రిగారు ఆకాశవాణికి అనేక రేడియో నాటకాలు సంతరించి ఘన యశస్సు నార్జించారు. అందులో ముఖ్యమైనవి కాళిదాసును గురించి "ప్రాణి ప్రధానం", బిల్హణ కవి జీవితంపై "బిల్హణీయం", పులకేశి అనే చారిత్రిక నాటకం, గరుత్మంతుని కథను "సత్య నిష్ట"గా, మనుచరిత్ర, నల చరిత్ర, రఘువంశ కథను "కుముద్వితీ పరిణయం"గా, విప్రనారాయణ చరితంను "వైజయింతీ విలాసం"గా, విడాకులపై "ఇయం సీతా మమ సుతా" అనే సాంఘీక నాటకాన్ని, దండి దశకుమార చరిత్రను "అవంతీ సుందరీ పరిణయం" నాటికలుగా మలచారు. ఇవన్నీ రేడియోలో ప్రసారమై బహుళ జనామోదం పొందాయి. శాస్త్రిగారి నల చరిత్ర నాటకాన్ని ధర్మపురి సంస్కృత కళాశాల ప్రిన్సిపల్ కీ.శే. కోరిడే రాజన్న శాస్త్రిగారు సంస్కృతం లోకి అనువదించగా "సురభారతి" సంస్థ ప్రచురించింది. మహా మహోపాధ్యాయ స్వర్గీయ శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు తమ అమృత హస్తాలతో ఆవిష్కరించి సార్ధకత కల్పించారు. ఇది పాఠ్యగ్రంథంగా చేయబడి, నాటక గౌరవాన్ని అనుమడింపజేసింది. శాస్త్రిగారు ఆంగ్లంలో "ది మైండ్ ఆఫ్ గాడ్" అనే ఆలోచనాత్మక రచన చేశారు. ఆంగ్ల పత్రికలలో శాస్త్రిగారి వ్యాసాలూ దర్శనమిస్తాయి.

శాస్త్రిగారు గొప్ప స్టేజీ నటులు కూడా. 1970 వరకు చాలా నాటకాలలో వివిధ పాత్రలు ధరించి మెప్పించారు. 1977లో లిటిల్ థియేటర్ వారి "విరజాజి" నాటకంతో హీరో పాత్ర ధరించి రంగస్థల నటనకు స్వస్తి పలికారు. ఇన్ని రకాలుగా విభిన్న రంగాలలో తమ శేముషీ వైభవాన్ని ప్రదర్శిస్తున్నారు. ఒకరకంగా పూర్ణ ప్రజ్ఞులు శాస్త్రిగారు. మహా ప్రాజ్ఞులు కూడా. శాస్త్రిగారితో మాట్లాడటమే "ఒక ఎడ్యుకేషన్".

శాస్త్రిగారి ఆంగ్ల రచన "ది మైండ్ ఆఫ్ గాడ్"ను "దైవ చిత్తం"గా నేను అనువదించి, సరసభారతి ద్వారా ప్రచురించటానికి అంగీకరించిన వారి సహృదయ సౌజన్యాలకు కృతజ్ఞతలు.

– గబ్బిట దుర్గాప్రసాద్



# స్టీఫెన్ హాకింగ్

**భౌ**తిక ఖగోళ శాస్త్రవేత్త స్టీఫెన్ విలియం హాకింగ్ 8-1-1942లో ఇంగ్లాండ్‌లోని ఆక్స్‌ఫర్డ్‌లో జన్మించాడు. కేంబ్రిడ్జ్ యూనివర్సిటిలోని సెంటర్ ఫర్ దీరేటికల్ కాస్మాలజికి రిసెర్చ్ డైరెక్టర్. జనరల్ రిలేటివిటికు చెందిన గ్రావిటేషన్ సింగ్యులారిటి దీరంస్‌పై రోజర్ పిన్ రోజ్‌తో కలిసి శాస్త్రీయ పరిశోధన చేశాడు. బ్లాక్ హోల్స్ (కృష్ణ బిలాలు) రేడియేషన్ వెలువరిస్తాయని కనుగొన్నాడు. దీనికే "హాకింగ్ రేడియేషన్" అనే పేరొచ్చింది. క్వాంటం మెకానిక్స్ జనరల్ దీరీ ఆఫ్ రిలేటివిటితో అనుసంధానం చేసి కాస్మాలజీ సిద్ధాంతాన్ని తయారు చేసిన వారిలో ప్రథముడు హాకింగ్. క్వాంటం మెకానిక్స్ చెప్పిన బహు ప్రపంచాలను సమర్థించాడు.

రాయల్ సొసైటీ ఆఫ్ ఆర్ట్స్‌కు హాకింగ్ ఆనరరి ఫెలో. పాంటిఫికల్ అకాడెమీ ఆఫ్ సైన్సెస్‌కు జీవిత సభ్యుడు. అమెరికా ప్రభుత్వం నుండి ప్రెసిడెన్షియల్ మెడల్ ఆఫ్ ఫ్రీడం అనే అత్యున్నత పౌర సన్మానం అందుకొన్న ప్రతిభామూర్తి. 1979-2009 కాలంలో కేంబ్రిడ్జ్ యూనివర్సిటి లుకేషియన్ ప్రొఫెసర్ ఆఫ్ మాథమాటిక్స్‌గా పని చేశాడు. పాపులర్ సైన్స్‌పై చాలా పుస్తకాలు రాశాడు. హాకింగ్ రాసిన "ఎ బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైం" అనే గ్రంథం 237 వారాలు బెస్ట్ సెల్లర్‌గా రికార్డ్ సృష్టించిందని బ్రిటన్‌కు చెందిన సండే టైమ్స్ పత్రిక తెలియజేసింది.

తక్కువ వయసులో హాకింగ్‌కు అరుదైన "ఏమియో ట్రోఫిక్ లేటరల్

(ఎ.ఎల్.ఎస్) అనే నరాలకు సంబంధించిన జబ్బుతో బాధపడ్డాడు. అదే తర్వాత శరీర పక్షవాతానికి దారితీసి కొన్ని దశాబ్దాలుగా బాధ అనుభవిస్తున్నారు. ఇప్పుడు స్పీచ్ జెనరేటింగ్ పరికరం ద్వారా తన మనోభావాలను తెలియజేస్తున్నారు. రెండుసార్లు పెళ్ళి చేసుకొని ముగ్గురు పిల్లలకు జన్మనిచ్చాడు. అయినా అనేక దేశాలు పర్యటిస్తూనే ఉన్నాడు. కెనడా ప్రభుత్వం ప్రానికా ప్రైజ్‌నిచ్చి గౌరవించింది. ఇప్పుడు ప్రైవేట్ జెట్‌లో పర్యటన చేస్తున్నాడు. 2007లో కూతురు లూసీతో కలిసి “జార్జెస్ సీక్రెట్ కి లు ది యూనివర్స్” రాసి ప్రచురించాడు. 2002లో బ్రిటన్ దేశపు వందమంది ప్రముఖులలో ఒకడుగా హాకింగ్ ఎంపికయ్యాడు. హాకింగ్ ఉద్యోగ పర్వంలో 39 విద్యార్థులు పి.హెచ్‌డి చేశారు. ఉద్యోగం నుంచి రిటైర్ కాకుండా కేంబ్రిడ్జ్ యూనివర్సిటిలో డిపార్ట్‌మెంట్ ఆఫ్ అప్లైడ్ మాథమాటిక్స్, దీరేటికల్ ఫిజిక్స్ రిసెర్చ్ డైరెక్టర్‌గా పనిచేస్తూ 2012లో తనకు రిటైర్ అయ్యే ఆలోచనే లేదని తెలియజేసాడు. 20-7-2015న “ఎక్స్‌ట్రా టెర్రె స్ట్రియల్ లైఫ్ పరిశోధనలో “బ్రేక్ ద్రు ఇనిషియేటివ్స్” ప్రారంభానికి తోడ్పడి మనం ఒంటరి వాళ్ళమా? (ఆర్ వియ్ ఎలోన్) అన్నదానికి సమాధానం కనుగొనటానికి సహాయ పడ్డారు.

40 ఏళ్ళ క్రితమే విశ్వంలో బ్లాక్‌హోల్స్ అనేకం ఉన్నాయని, ఇవి గ్రహాలూ నక్షత్రాలను తమలోనికి పీల్చేసుకొంటున్నాయని హాకింగ్ ప్రతిపాదించాడు. వందేళ్ళ క్రితం ఐన్‌స్టీన్ సిద్ధాంతీకరించిన గురుత్వాకర్షణ తరంగాలను 130 కోట్ల కాంతి సంవత్సరాల దూరంలో రెండు బ్లాక్‌హోల్స్ ఒకదానికొకటి ఢీ కొట్టినప్పుడు ఏర్పడినట్లు మొదటిసారిగా శాస్త్రవేత్తలు గుర్తించినట్లు ప్రకటించారు. ఇలాంటి ఈ తరంగాలను అమెరికాలో రెండుచోట్ల ఏర్పాటేచేసిన “లేజర్ ఇంటర్ ఏరో మీటర్ గ్రావిటేషనల్ వేవ్ అబ్జర్వేటరీ” (లిగో) ద్వారా అంతర్జాతీయ శాస్త్రవేత్తల బృందం గత సెప్టెంబర్‌లో గుర్తించినట్లు ఈ ఫిబ్రవరిలో ప్రకటించి అటు అయిన్ స్టీన్, ఇటు హాకింగ్‌ల సిద్ధాంతాలకు తిరుగులేని రుజువులు చూపింది.

ఇప్పుడున్న సామాజిక, రాజకీయ, పర్యావరణ సంక్షోభంలో మానవ జీవితం మరో వందేళ్ళు మనగలుగుతుందా? అని ఇంటర్నెట్‌లో ప్రశ్నించాడు హాకింగ్. అకస్మాత్తుగా వచ్చే న్యూక్లియర్ యుద్ధం భూమికి చాలా చేటు తెస్తుందని వైరస్, గ్లోబల్ వార్మింగ్ వంటివాటి వలన అనుకోని ఉపద్రవాలు కలుగుతాయని

హెచ్చరించాడు. "సూపర్ ఇంటలిజెంట్ ఆర్టిఫిషియల్ ఇంటలిజెన్స్" మానవ భవిషత్తును నిర్ణయిస్తుందన్నాడు. మానవ చరిత్రలో ఆర్టిఫిషియల్ ఇంటలిజెన్స్ ఆవిష్కరణ అరుదైన గొప్ప సంఘటన అన్నాడు. ఇందులోని ప్రమాదాలను మనం గుర్తించకపోతే ఇదే చివరిది అయ్యే ప్రమాదం ఉందన్నాడు. కంప్యూటర్ వైరస్ కొత్త జీవులకు స్థానం కల్పిస్తోందని, ఆదిమానవ వినాశనానికి దారి తీస్తుందని జాగ్రత్త పడాలని కోరాడు. మన ప్రతిబింబం నుండి జీవిని సృష్టించే దాన్ని గురించి ఇప్పుడు మాట్లాడుకోవాలని చెప్పాడు. ఆధునిక శాస్త్రీయ విజయాలను ఫిలాసఫీ లక్ష్య పెట్టటం లేదని బాధపడ్డాడు. స్వర్గం కాని, పునర్జన్మ కాని లేవన్నాడు. 2014లో తాను "నాస్తికుడిని" అని హాకింగ్ ప్రకటించాడు.

జీరో గ్రావిటి కార్పోరేషన్ ఆధ్వర్యంలో 2007లో "వామిట్ కామెట్" అనే జీరో గ్రావిటి ఫ్లైట్‌లో ప్రయాణించి రికార్డ్ సృష్టించాడు. సైన్స్‌లో స్వయంగా ఆరు, ఇతరులతో కలిసి అయిదు, బాల సాహిత్యంలో నాలుగు రచనలు చేశాడు. హాకింగ్ పైనా, ఆయన రచనలపైనా సినిమాలు తీశారు. వైకల్యం శరీరానికే తప్ప, సంకల్పానికి, మనసుకు కాదని తన జీవితం ద్వారా నిరూపించి మానవళికి గొప్ప ప్రేరణ, స్ఫూర్తి కలిగించిన మహోన్నత శాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగ్.

## ఎంట్రోపి

"దైవ చిత్తం" గ్రంథంలో "ఎంట్రోపి" పదానికి చాలా ప్రాముఖ్యముంది. దాన్ని కొంచెం వివరిస్తే బాగుంటుందని అనిపించింది. థర్మో డైనమిక్స్ అంటే ఉష్ణగతిక శాస్త్రం రెండవ నియమం ప్రకారం ఆర్.జే.యి.క్లాసియాస్ శాస్త్రవేత్త ప్రవేశపెట్టిన ఒకరకమైన స్థితి ప్రమేయమే ఎంట్రోపి. ఇది గ్రీకు పదం. ఎన్ అంటే శక్తి. ట్రోపి అంటే మార్పు. అంటే శక్తి మార్పు అని అర్థం. ఉష్ణ యంత్రాల ప్రవర్తనలను అధ్యయనం చేయటానికి బాగా ఉపయోగపడుతుంది. ఇంకొంచెం వివరంగా చెప్పాలంటే "వ్యవస్థ క్రమ రాహిత్యాన్ని తెలియజేసే పదార్థ ధర్మమే" ఎంట్రోపి. ఒక వ్యవస్థకు ఉష్ణాన్ని అందించినప్పుడు, అందులో అణువుల క్రమ రాహిత్యం పెరుగుతుంది కనుక ఎంట్రోపి పెరుగుతుంది. వ్యవస్థ ఉష్ణాన్ని కోల్పోయినప్పుడు అణువుల క్రమరాహిత్యం తగ్గి ఎంట్రోపి తగ్గుతుంది. దీనిని వ్యవస్థ నుంచి లభ్యం కాని శక్తికి కొలమానంగా ఉపయోగిస్తారు.

ఉష్ణోగ్రత పీడనాలను, వాటిలో వచ్చే మార్పుల్ని అనుభూతి ద్వారా తెలుసుకోగలం. కాని ఎంట్రోపిలోని మార్పుల్ని భౌతికానుభూతి ద్వారా తెలుసుకోవటం సాధ్యంకాదు. కనుక దాని భౌతిక భావనలను అర్థం చేసుకోవటం చాలా కష్టం. మార్పు జరిగే మార్గంపై ఎంట్రోపి ఆధారపడదు. క్రమరాహిత్యం పెరిగితే ఎంట్రోపి పెరుగుతుంది. కోల్పోయిన లేక గ్రహించిన ఉష్ణరాశిని పరమ ఉష్ణోగ్రత చేత భాగిస్తే ఎంట్రోపిలో వచ్చే మార్పు తెలుస్తుంది. ఇంతకంటే లోతుకు వెళ్ళటం అనవసరం. ఎంట్రోపీలో పెరుగుదల అంటే అందులోని అన్ని అనుఘటకాల పెరుగుదల కాదు. కొన్నిటిలో తగ్గుదల ఉండి, కొన్నిట్లో స్థిరంగా ఉండచ్చు.

ఎంట్రోపి పెరుగుదల వలన, ఉష్ణ అలజడి పెరిగి, అణువుల క్రమ రాహిత్యం పెరుగుతుంది. అంటే ఎంట్రోపి పెరుగుదల క్రమస్థితి నుంచి క్రమ రాహిత్య స్థితికి మారుతుంది. ఎక్కువ ఎంట్రోపి ఉంటే ఎక్కువ రాహిత్యం ఉంటుందన్నమాట. వాయుస్థితిలో క్రమరాహిత్యం ఎక్కువ కనుక ఎంట్రోపి కూడా ఎక్కువే. ఘనస్థితిలో కంటే ద్రవస్థితిలో కూడా ఎక్కువే. మంచు నీరై ఆవిరైనప్పుడు క్రమరాహిత్యం, ఎంట్రోపి నిరంతరం పెరుగుతాయి. ఉష్ణోగ్రత తగ్గితే రెండూ తగ్గుతాయి. పదార్థం యొక్క వేడికి కొలమానం ఉష్ణోగ్రత. అలాగే అణువుల క్రమరాహిత్యానికి కొలమానం ఎంట్రోపి. పరమ శూన్య ఉష్ణోగ్రత వద్ద (ఆబ్సల్యూట్ జీరో) అణువుల అలజడి మాయమై క్రమరాహిత్యం ఎంట్రోపి రెండూ శూన్యమౌతాయి. అంటే అణువులు ఒక క్రమ పద్ధతిలో అమరి ఉంటాయని గ్రహించాలి. ఇదే థర్మో డైనమిక్స్‌లో మూడవ నియమం.

## విశ్వంలోని ఎంట్రోపి

రివర్సిబిల్ సైకిల్ ప్రాసెస్ అంటే ఉత్క్రమణీయ ప్రక్రియలో వ్యవస్థ ఎంట్రోపి స్థిరంగా ఉంటుంది. ఇర్రివర్సిబిల్ ప్రాసెస్ అంటే అనుత్క్రమణీయ ప్రక్రియ వ్యవస్థ ఎంట్రోపి పెరుగుతుంది. కనుక మొదటి దానివలన ఎంట్రోపి మారదు. కాని రెండవ దానివలన విశ్వం ఎంట్రోపి పెరుగుతుందని తెలుసుకోవాలి. విశ్వంలోని అన్ని భౌతిక ప్రక్రియలు ఇర్రివర్సిబుల్ కనుక విశ్వం ఎంట్రోపి పెరుగుతుంది.

**– గబ్బిట దుర్గాప్రసాద్**

ముందుమాట




## దుర్గా ప్రసాదము

– ప్రొఫెసర్ ముదిగొండ శివప్రసాద్

చారిత్రక నవలా చక్రవర్తి

శ్రీ యుతులు ఎ.సి.పి.శాస్త్రి గారితో నాకు బహుకాల పరిచయం ఉంది. వారు భువన విజయములో రామరాజ భూషణుని పాత్రను సమర్ధవంతం పోషిస్తారు. మంచిసంగీత విద్వాంసుడు. సంగీత కళా రహస్య నిధి మాత్రమే కాక వైదిక విద్యాపారాయణుడు. రిజర్వ్ బ్యాంక్‌లో పని చేసిన ఆర్థికుడు. వీరి ఆంగ్ల రచన "మైండ్ ఆఫ్ గాడ్" గొప్ప శాస్త్రీయ విశ్లేషణాత్మక రచన. ఐన్‌స్టీన్, స్టీఫెన్ హాకింగ్ వంటి వారి విశ్వశోధనా సారాంశమే ఈ కృతి, సుకృతి. శ్రీయుతులు గబ్బిట దుర్గాప్రసాద్ గారు ఉయ్యూరు పట్టణ వాస్తవ్యులు. వారు శాస్త్రిగారి గ్రంథమును తెలుగులోనికి స్వేచ్ఛానువాదము చేసినారు. నిజమునకు ఈ గ్రంథమును రచించిన వారికి, పఠించెడి వారికి గణిత, ఖగోళ, భౌతిక శాస్త్రములలో కనీస పరిచయం

అవసరము. దీనిలో విశ్వ రహస్య భేదనమునకై కృషి జరిగింది. భారతీయ వేదాంతముపై పాశ్చాత్యులకు అవగాహన లేదు. వారు సైన్సు మాత్రమే నమ్మెదమని చెబుతారు. మరి సైన్సు అంటే ఏమిటి? విశ్లేషణాత్మక అవగాహన. సైన్సు సదా పరిణామ శీలము. న్యూటన్ చెప్పినది హాకింగ్ కాలము నాటికి మారిపోయింది. అట్లని మొదటి శాస్త్రజ్ఞుడి నిజాయితీని మనం శంకించలేము. ఈ శాస్త్రములు అట్టివే. మనము సౌరమండలములో జీవిస్తున్నాము. ఇటీవల శాస్త్రజ్ఞులు ఇట్టి సౌరమండలములో పాలపుంతలు లెక్కకు మిక్కిలిగా ఉన్నట్లు తేల్చారు. మనకు తెలిసిన ఈ మండలంలోని గ్రహముల సంఖ్య రోజు రోజుకూ పెరిగిపోతున్నది. భారతీయ పురాణములను పలు పాశ్యాత్యులు పుక్కిటి పురాణములని పరిహసించారు; పరిహరించారు. "పురా-నవములే" పురాణములు. ఇందులో భారతీయ చరిత్ర ఉంది. ఆధ్యాత్మికత ఉంది. సంకేతములతో అనంత శాస్త్ర విజ్ఞానముంది. దానిని "డీసైఫర్" చేసుకోవటం నేడు కష్టమవుతున్నది. వేదములోని అర్థము మాత్రము మనకు అందుతున్నదా? దానిని కూడా "డికోడ్" చేసుకోగలిగిన సమర్థులెవరు? కృష్ణ బిలములు (బ్లాక్ హోల్స్) ప్రసక్తి ఋగ్వేదంలో ఉంది. కాల స్వరూప గణన లౌకికంగా చమకములో ఉంది. అలౌకికముగా ఋగ్వేదంలో ఉంది. ఈ మహా విషయములను ఋషులు తపస్సులో దర్శించారు. మనకు ఉన్న మనస్సు పరిమితము. ఇట్టిదే ఈశ్వరునకు ఒక మనస్సు ఉంది. దానినే యూనివర్సల్ మైండ్ అన్నారు. దీనికే "దైవ చిత్తము" అని ఈ రచయిత నామకరణం చేశారు. నిజానికి శంకరుడు, ఐన్‌స్టీన్ చెప్పినది అర్థమైనవారు వేళ్ళపై లెక్కింపదగిన సంఖ్యలో ఉన్నారు. మహా విషయములు తేలికగా అర్థము కావు. టైం మెషీన్‌లో ముందుకే కాదు, కాలములో వెనుకకు కూడా వెళ్ళవచ్చును. అది కాంతి వర్షముల దూరమునుసరించి సాధ్యము. కాలమే కాలుడు, కాళి. ఇదొక కాలోపాసన. విశ్వము సాపేక్షము. నేడు మనము చూచే నక్షత్రములలో కొన్ని వెయ్యి సంవత్సరముల క్రితమే నశించిపోయాయి. అయినా కాంతి వర్షముల కారణముగా అవి అక్కడ ఉన్నట్లు భ్రాంతి కలుగుతున్నది. ఇదొక విచిత్రము. భగవంతుడు మనస్సుకు అందదు. "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహా". ఆర్ష

మతానికి ఇదే అర్థము. శాస్త్రిగారు కారణ జన్ములు. గబ్బిటవారు పండిత శ్రేష్ఠులు. వీరీ గ్రంథమును రచించి మహోపకారము చేశారు. పాఠకులు తొందరపడక నెమ్మది నెమ్మదిగా చదివి అర్థం చేసుకోవటానికి ప్రయత్నించండి. భాష సరళాతి సరళంగా ఉన్నప్పటికీ ఇది సాంకేతిక భాష కావటం వలన మెల్ల మెల్లగా అర్థమవుతుంది. దశావతారాలు అందరికి తెలుసు కానీ కూర్మావతారము, శివుని గరళకంఠ రహస్యము ఎందరికి తెలుసు? ఆ వివరాలు ఈ గ్రంథంలో ఉన్నాయి.

ఈ పుస్తకానికి ముందుమాట వ్రాయవలసిందిగా రచయితలిద్దరూ నన్ను అర్థించటానికి కారణం, నాపై వారికి గల అవ్యాజమైన ప్రేమానురాగాలే. ఈ గ్రంథం చదవటం వల్ల భారతాది పురణేతిహాసాలపై ఆధునిక విద్యార్థులకు గౌరవం పెరుగుతుందని ఆశిస్తున్నాను.

వ్యక్తిచిత్తము– దైవ చిత్తము. ఈ రెండింటిని తులనాత్మకంగా పర్యాలోచించండి. నిర్జీవశక్తి (Matter) సజీవ శక్తి (Life) ఈ రెండింటి సామర్థ్యతో తొలి శిలా పదార్థం ( rock) గూఢ శక్తి. ఈ అర్థానినే శాస్త్రవేత్తలు, అరవిందుడు మొదలగు వారు చెప్పిన విషయములలో ఆవిష్కరించారు. ఆదిశంకరుల "శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం" అనే విషయం, నేటికి రెండువేల సంవత్సరాలకు పూర్వమే చెప్పటం ఆశ్చర్యాన్ని ఆనందాన్ని కలిగిస్తుంది.

ఇతి శమ్ **– ముదిగొండ శివప్రసాద్**

హైదరాబాద్, 20– ఫిబ్రవరి 2016



# గత ఏడాది మా సరసభారతి కార్యక్రమాలు

సరసభారతి 76వ కార్యక్రమంగా శ్రీ మన్మథ ఉగాది వేడుకలను 15-3-2015 ఆదివారం నిర్వహించి పెద్దలకు ఉగాది పురస్కారాలందజేసి "గీర్వాణ కవుల కవితా గీర్వాణం", "త్యాగి పే 'రెడీ'లు" గ్రంథాల ఆవిష్కరణ జరిపి, "నవ్యాంధ్రప్రదేశ్"పై కవిసమ్మేళనం నిర్వహించిన సంగతి మీకు తెలుసు. 77వ సమావేశంగా మచిలీపట్నంలో 2-4-15 గురువారం స్థానిక సాహితీ సంస్థలతో కలిసి అవధాన సరస్వతి స్వర్గీయ రాళ్ళబండి కవితా ప్రసాద్ గారికి "కవితాంజలి" నిర్వహించాం. ఉయ్యూరులో సరసభారతి గౌరవాధ్యక్షులు శ్రీమతి జోశ్యుల శ్యామలాదేవి గారింట శ్రీ వేదగిరి రాంబాబు, డా. కొంపెల్ల శర్మ, చిత్రకారుడు శ్రీ బాలిలతో 78వ దైన ఆత్మీయ సమావేశం నిర్వహించి కీ.శే. పాలగుమ్మి పద్మరాజు గారి శత జయంతి జరిపాం. 79 సమావేశంగా శ్రీ సువర్చలాంజనేయస్వామి దేవాలయంలో 13-5-15 బుధవారం శ్రీ హనుమజ్జయంతి నాడు శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ రచన "దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు" గ్రంథావిష్కరణ సభ జరిపి శాసనమండలి సభ్యులు శ్రీ వై.వి.బి.రాజేంద్రప్రసాద్ గారిచే ఆవిష్కరింపజేశాం. దీనికి స్పాన్సర్ శ్రీ జే. వేలూరి కాగా, కృతస్వీకర్తలు శ్రీ వేలూరి వివేకానంద్, శ్రీమతి దుర్గ దంపతులు. భారతరత్న అబ్దుల్ కలాం గారికి నివాళిగా 80వ సమావేశాన్ని 3-8-15 సోమవారం స్థానిక పి.ఆర్.ఎస్.ఏం.జే.కాలేజీతో సంయుక్తంగా నిర్వహించాం.

స్థానిక పరిం కాయల కాలేజీతో కలిసి 5-9-15 శనివారం 81వ సమావేశంగా ఉపాధ్యాయ దినోత్సవం నాడు శ్రీ దుర్గాప్రసాద్ గారికి శ్రీ మైనేని వారికి 70 ఏళ్ళ క్రితం ప్రాథమిక విద్య బోధించిన స్వర్గీయ కోట సూర్యనారాయణశాస్త్రి మేష్టారు గారి గౌరవ పూర్వకంగా "గురుపూజోత్సవం"

నిర్వహించాం. శ్రీమతి సింగరాజు కల్యాణి, శ్రీమతి కళీపట్నం ఉమా గారల సంగీ కచేరి ఏర్పాటుచేశాం. కోట మాస్టారు చిత్రపటాన్ని ప్రముఖ ఆర్టిస్ట్ శ్రీ టి.వి.ఎస్.బి.శాస్త్రి (ఆనంద్)తో చిత్రింపజేసి, శ్రీ వి.వి.బి.రాజేంద్రప్రసాద్ గారిచే, కోట మాష్టారి కుమారులు శ్రీ చంద్రశేఖరశాస్త్రి, శ్రీ గాయత్రి ప్రసాద్, శ్రీ సీతారామాంజనేయులు, బంధువులు, ప్రముఖ కూచిపూడి నాట్యాచార్యులు, కేంద్ర నాటక పరిషత్ పురస్కార గ్రహీత, డా.వేదాంతం రాధేశ్యాం, ఆర్టిస్ట్ శ్రీ ఆనంద్ సమక్షంలో ఆవిష్కరింపజేశాం. అతిథులందరికి నూతన వస్త్రాలు, నగదు రూప కానుకలు, శాలువాలతో శ్రీ మైనేని గోపాలకృష్ణ, శ్రీమతి సత్యవతి దంపతుల సౌజన్యంతో అందజేశాం. కార్యక్రమాన్ని ప్రత్యక్ష ప్రసారం చేయించి శ్రీ మైనేని వారు వీక్షించే ఏర్పాటు చేశాం. దీని మొత్తం ఖర్చు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారే భరించి గురు భక్తి చాటుకొన్నారు. స్థానిక శాంతినికేతన్ స్కూల్, పరింకాయల కాలేజి పేద ప్రతిభగల విద్యార్థికి, విద్యార్థినిలకు శ్రీ మైనేనివారు చెరొక పదివేల రూపాయలు నగదు బహుమతులను, స్వర్గీయ కోట సూర్యనారాయణశాస్త్రి గారి స్మారక పురస్కారంగా సరసభారతి చేత అందజేయించారు. శ్రీ కోట సోదరులు మరొక పేద విద్యార్థినికి పదివేల రూపాయలు తమ తండ్రిగారి పేర పురస్కారం అందజేశారు. కనుల పండువగా ఈ కార్యక్రమం శ్రీ కన్యకా పరమేశ్వరీ ఆర్య వైశ్య ప్రార్థనా మందిరంలో జరిగింది. అందరికి విందు ఏర్పాటు చేశాము.

82వ సమావేశంగా 5-9-15 శనివారం శ్రీకృష్ణాష్టమి వేడుకలను శ్రీ సువర్చలాంజనేయ స్వామి దేవాలయంలో జరిపాం. 17-11-15న గ్రంథాలయ వారోత్సవాలలో 83వ సమావేశంగా “అమరావతి”పై విద్యార్థులకు వక్తృత్వ పోటీలు పెట్టాం. 84వ కార్యక్రమంగా విజయవాడ టాగూర్ లైబ్రరీలో రమ్యభారతి, మల్లెతీగ సాహితీ సంస్థలతో కలిసి గ్రంథాలయ వారోత్సవాలలో 18-11-15 బుధవారం “నవ్యాంధ్రప్రదేశ్ నవ నిర్మాణం”పై కవిసమ్మేళనం నిర్వహించాం. కార్తీక మాసంలో “కార్తీక వైభవం”పై శ్రీ నవులూరి రమేష్‌బాబు గారిచే 8-12-15 మంగళవారం శ్రీ సువర్చలాంజనేయ స్వామి దేవాలయంలో ధార్మిక ప్రసంగం ఏర్పాటు చేశాం. స్వామి వివేకానంద 152వ జయంతిని పరింకాయల కాలేజీ వారితో కలిసి ఫ్లోరా స్కూల్‌లో 12-1-2016న శాసనమండలి సభ్యులు శ్రీ వై.వి.బి.రాజేంద్రప్రసాద్ ముఖ్య అతిథిగా జరిపాం.

ఉయ్యూరుకు చెందిన ప్రముఖ సైంటిస్ట్ స్వర్గీయ కొలచల సీతారామయ్య గారిపై శ్రీ దుర్గాప్రసాద్ గారు రచించిన “కేమోటాలజి పిత కొలచల సీతారామయ్య-

పుల్లేరు నుండి ఓల్గా దాకా" గ్రంథావిష్కరణ సభను 87వ కార్యక్రమంగా స్థానిక ఏ.జి అండ్ ఎస్.జి సిద్ధార్థ డిగ్రీ కళాశాల కెమిస్ట్రీ డిపార్ట్‌మెంట్‌తో సంయుక్తంగా 25-1-16 సోమవారం కాలేజి సెమినార్ హాల్‌లో నిర్వహించాం. భారత్ టుడే ప్రధాన సంపాదకులు శ్రీ జి.వల్లీశ్వర్, డా. సూరి శ్రీమతి గార్లు గ్రంథావిష్కరణ చేయగా, కొలచల వారి బంధుగణం, కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్ష కార్యదర్శులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. జి.వి.పూర్ణచంద్, కాలేజి కన్వీనర్ శ్రీ టి.శ్రీహరిరావు, ప్రిన్సిపాల్ శ్రీ కె.సత్యనారాయణ, రమ్యభారతి సంపాదకులు శ్రీ చలపాక ప్రకాష్, రచయిత శ్రీ జి.కృష్ణమోహన్, శ్రీ సూరి ఆంగీరస శర్మ అతిథులుగా హాజరైనారు. హ్యాం రేడియో అధినేత శ్రీ సూరి శ్రీరామమూర్తి, యువకుడు, ప్రసిద్ధ అంతర్జాతీయ హ్యాం సేవా కార్యకర్త శ్రీ టాం జోస్ అతిథులుగా హాజరై కార్యక్రమానికి నిండుతనం తెచ్చారు.

88వ కారయక్రమంగా సంగీ సద్గురు శ్రీ త్యాగరాజస్వామి 169వ ఆరాధనోత్సవం 29-1-16 శుక్రవారం జరిపి ప్రసిద్ధ గాయని శ్రీమతి వి.శాంతిశ్రీ గారిచే పంచరత్న కీర్తనాలాపన చేయించాం. ఆమె ఎంతో శ్రావ్యంగా గానం చేసి శ్రోతలను తన్మయులను చేశారు. శ్రీ మైనేని గోపాలకృష్ణ గారు తమ తల్లిగారు స్వర్గీయ మైనేని సౌభాగ్యమ్మగారు ఎల్లప్పుడూ త్యాగరాజ కీర్తనలను ఆలపిస్తూ ఉండేవారని, ఆమె గతించి 40 ఏళ్ళు అయిందని, ఆమె స్మారకార్థం ఈ సంగీత కచేరి చేసిన గాయనికి సరసభారతి ద్వారా నగదు పారితోషికం అందజేయమని డబ్బు పంపగా, సభాముఖంగా అందజేసాము. 14-2-16 ఆదివారం రథసప్తమి నాడు సామూహిక శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతం శ్రీ సువర్చలాంజనేయ స్వామి దేవాలయంలో నిర్వహించి, పొన్నూరు సంస్కృత కాలేజి రిటైర్డ్ ప్రిన్సిపాల్ శ్రీ తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారిచే ధార్మిక ప్రసంగం చేయించి, వారు రచయించి, సరసభారతి ప్రచురించిన 19వ పుస్తకం "శ్రీరామ వాణి"ని శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ గారి చేతుల మీదుగా ఆవిష్కరింప జేశాం.

ఇప్పటికి "దైవ చిత్రం"తో సహా సరసభారతి 20 పుస్తకాలు ప్రచురించటం, శ్రీ దుర్గాప్రసాద్ గారు అందులో 13 పుస్తకాలు రచించటం సరసభారతికి గర్వకారణం. శ్రీ దుర్ముఖి ఉగాది వేడుకలుగా 90వ సమావేశంగా సరసభారతి మరియు స్థానిక రోటరీ క్లబ్ సంయుక్తంగా 3-4-2016 ఆదివారం సాయంత్రం నిర్వహించే కార్యక్రమాలలో భాగంగా ఈ గ్రంథాన్ని సరస్వతిపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు గారి కుమార్తె డా. శ్రీమతి పుట్టపర్తి నాగపద్మినిగారు ముఖ్య

అతిథిగా విచ్చేసి "దైవ చిత్తం" గ్రంథావిష్కరణ చేయటం, దీనికి కృతి స్వీకర్త, ప్రాయోజకులు మా ఆత్మీయులు శ్రీ మైనేని గోపాలకృష్ణ గారు కావటం మా అదృష్టం. ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం అధ్యక్షులు శ్రీ సోమేపల్లి వెంకట సుబ్బయ్యగారు గౌరవ అతిథిగా, శాసనమండలి సభ్యులు శ్రీ వై.వి.బి. రాజేంద్ర ప్రసాద్, కే.సి.పి. సి.యి.ఓ శ్రీ జి.వెంకటేశ్వరరావు, రోటరీక్లబ్ అధ్యక్షులు, కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి, రమ్యభారతి సంపాదకలు శ్రీ చలపాక ప్రకాష్ ఆత్మీయ అతిథులుగా పాల్గొనటం, డా. శ్రీమతి పుట్టపర్తి నాగపద్మిని, శ్రీ సోమేపల్లి వెంకటసుబ్బయ్య, డా. శ్రీమతి, డా. శ్రీ రావి మోహన రావు, శ్రీమతి కృష్ణకుమారి దంపతులు, శ్రీ తూములూరు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారు, శ్రీ గరిమెళ్ళ సోమయాజులు శర్మ, డా. నాగరాజు అలిసేటి, ప్రముఖ హరికథా భాగవతారిణి శ్రీమతి మద్దాలి (వై) సుశీల, శ్రీ ఏ.సి.పి.శాస్త్రి గార్లకు స్వర్గీయ గబ్బిట భవానమ్మ, మృత్యుంజయ శాస్త్రి గారల ఉగాది పురస్కారాలను శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్, శ్రీమతి ప్రభావతి దంపతులు ప్రదానం చేయటం, ఈ దంపతులు ఏర్పాటుచేసిన "స్వయంసిద్ధ" ప్రోత్సాహక ఉగాది పురస్కారాలను అమరవాణి హైస్కూల్ సంస్థాపక నిర్వాహకులు శ్రీ పి.నందకుమార్ గారికి, యువ ఆర్కిటెక్ట్ కుమారి చతుర్వేదుల యశస్వినికి, అంధ కంప్యూటర్ ఉపాధ్యాయుడు చి. వీర్ల ప్రసాద్‌కు అందించటం, ప్రముఖ సంగీత విద్వాంసురాలు శ్రీమతి వి.శాంతిశ్రీ గారు వీనుల విందైన గాత్ర సంగీత కచేరి చేయటం, "మా అన్నయ్య" శీర్షికపై ఏర్పాటుచేసిన ఆత్మీయ ఉగాది "కవిసమ్మేళనం"లో 40కి పైగా ప్రసిద్ధ కవికోకిలలు పాల్గొని కవితా కలకూజితాలతో రసప్లావితం చేయటంతో, అసలే తీపెక్కిన ఉయ్యూరులో అయిదురోజుల ముందే వసంతం హసించి, ఉగాది పండుగ వాతావరణం నెలకొన్నది. సాహితీ బంధువులు సరసభారతిపై చూపిస్తున్న ఆదరాభిమానాలకు ధన్యులం అని మనవి చేస్తున్నాను. రోటరీ క్లబ్ వారు అందజేసిన సహాయ సహకారాలు మరువలేనివి. వారికి కృతజ్ఞతలు.

సరసభారతి కార్యవర్గ సభ్యుల సహాయ సహకారాలు, మా గౌరవాధ్యక్షులు శ్రీమతి జోశ్యుల శ్యామలాదేవి, మా సాంకేతిక నిపుణులు శ్రీ వి.బి.జి.రావు గారల తోడ్పాటు, మీడియా మిత్రుల ప్రోత్సాహం, సంగీత సాహిత్యాభిమాన బంధువుల ఆదరణలు మరువలేనివి. ఎందరో మహానుభావులు అందరికి వందనములు.

**– మాదిరాజు శివలక్ష్మి**

కార్యదర్శి – సరసభారతి

# నా మనవి

దైవ చిత్తంగా తమ "మైండ్ ఆఫ్ గాడ్" ఆంగ్ల పుస్తకాన్ని అనువదించి, ప్రచురించటానికి అనుమతించిన శ్రీ ఏ.సి.పి. శాస్త్రిగారికి కృతజ్ఞతలు. దీనికి ముందుమాటలను మా మీద ఉన్న అభిమానంతో అడిగిన వెంటనే అంగీకరించి, అతి తక్కువ సమయంలో "దుర్గాప్రసాదం"గా రాసి అందజేసిన చారిత్రిక నవలా చక్రవర్తి, ప్రఖ్యాత సాహితీ విశ్లేషకులు ప్రొఫెసర్ శ్రీ ముదిగొండ శివప్రసాద్ గారికి నమస్కరించటం తప్ప ఏమిచ్చి మా ఋణం తీర్చుకోగలం? ఇది నిజంగా మాకు, మనకు "శివప్రసాదం". వారితో అత్యంత సన్నిహితులైన శ్రీ శాస్త్రిగారి కృషియే ఇదంతా. నేను ఇందులో నిమిత్త మాత్రుడిని. ఈ గ్రంథ ఖ్యాతి అంతా శ్రీ శాస్త్రిగారిదే. వారి తాత్విక విశ్లేషణ అమోఘం. వేద వేదంగ పురాణ ఇతిహాసాలపై వారికున్న అవగాహనకు ఈ పుస్తకం ఒక గొప్ప ఉదాహరణ.

దైవ చిత్తంను నేను అంతర్జాలంలో రాస్తున్నప్పుడే శ్రీ మైనేని గోపాలకృష్ణ గారి కన్ను దీనిపై పడింది. దీనిని పుస్తక రూపంలో తేవాల్సిన అవసరం ఎంతైనా ఉందని తానే స్పాన్సర్‌గా ఉంటానని ముందుకొచ్చి వేరొకరికి అవకాశం లేకుండా చేశారు. ఇంతటి శాస్త్ర పారమార్థిక గ్రంథాన్ని అంకితం పొందే అర్హత శ్రీ మైనేని వారికే ఉందని నేనూ శాస్త్రిగారూ భావించి బలవంతం మీద గోపాలకృష్ణ గారిని ఒప్పించగలిగాం. వారి సుమనస్కతకు సర్వదా సరసభారతి, నేనూ కృతజ్ఞులం.

సరసభారతి పుస్తకాలను ముద్రించి సకాలంలో అందజేసినందుకు శ్రీ చలపాక ప్రకాష్ గారికి, భావగర్భితమైన ముఖచిత్రం డిజైన్ చేసి అందించి శ్రీ కళాసాగర్ గారికి కృతజ్ఞతలు.

**- గబ్బిట దుర్గాప్రసాద్**

అధ్యక్షులు, సరసభారతి

## 'సరసభారతి' పుస్తక ప్రచురణకు విరాళాలందజేసిన దాతలకు కృతజ్ఞతలు

1. శ్రీమతి గొట్టుముక్కల మారుతీదేవి, హైదరాబాద్ రూ. 1116/-

2. శ్రీ అన్నపరెడ్డి రాహుల్ రెడ్డి , హైదరాబాద్ రూ. 1116/-

पोरंकि दक्षिणामूर्ति
PORANKI DAKSHINAMURTY
PH.D.
Former Member, Executive Board and
Former Convener, Telugu Advisory Board,
SAHITYA AKADEMI, New Delhi-1

పోరంకి దక్షిణామూర్తి
పూర్వ ఉపసంచాలకుడు
తెలుగు అకాడమి,
హిమాయత్‌నగర్,
హైదరాబాదు-500060

**మి**త్రులు శ్రీ పున్నయ్యశాస్త్రి గారికి,

నమస్సులు.

'పులకేశి' నాటకంతో సహా, మీరు పంపిన పుస్తకాలన్నీ చదివి ఆనందించాను.

'బిల్హణీయ' సంస్కృత కావ్యాన్ని ఆధారం చేసుకొని 1958లో నేను రాసిన– అరగంట రేడియో నాటికను స్థానం నరసింహారావుగారు ప్రసారం చేశారు. మీ పుస్తకం చదువుతుంటే అప్పటి రోజులు గుర్తుకు వచ్చాయి నాకు.

మంచి పుస్తకాలు చదివే అవకాశం ఇచ్చినందుకు ధన్యవాదాలు.

ముఖ్యంగా చెప్పవలసింది– **"THE MIND OF GOD"**అన్నది అద్భుతంగా ఉంది. **Stephen Hawking** రాసిన, **A Brief History Of Time** అన్నది నేను చాలా ఏళ్ళ కిందట చదివాను. దాన్ని గురించి మీరు రాసిన పుస్తకం చదివాక, దాని విలువ నాకు బాగా తెలిసింది. హాకింగ్ అభిప్రాయాలను కొన్ని ప్రస్తావిస్తూ మీరు, వాటికి సమానార్థకంగానో, వివరణాత్మకంగానో ఉదహరించిన, భారతీయుల దార్శనిక భావాలను తెలుపుతూ రాసిన విషయాలు బాగున్నాయి. విజ్ఞాన శాస్త్ర దృష్టిగల విదేశీయులకు మీరు ఉదాహరించినవి బాగా అర్థం కావాలంటే వాటికి వైజ్ఞానిక వ్యాఖ్యానం ఇంకా పెంచవలసి ఉంటుందేమో! హాకింగ్ కూడా దాన్ని చదివి సంతోషిస్తాడేమో!

మొత్తంమీద మీరు చేస్తున్న కృషికి హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

భవదీయుడు

**దక్షిణామూర్తి**

**09/09/15**

# గ్రంథకర్త పరిచయం



| | |
|---|---|
| పేరు: | గబ్బిట దుర్గాప్రసాద్ |
| జననం: | 27-06-1940, ఉయ్యూరు |
| తలిదండ్రులు: | భవానమ్మ, మృత్యుంజయశాస్త్రి |
| భార్య: | ప్రభావతి |
| విద్య: | ఎం.ఏ. (తెలుగు), బి.ఎస్.సి., బి.ఎడ్. |
| ఉద్యోగం: | సైన్స్ టీచర్, హెడ్ మాస్టర్, కృష్ణాజిల్లా హైస్కూల్స్ (1963-1998) |
| సాహితీ వ్యాసంగం: | రచనలు, సరసభారతి- అధ్యక్షులు |
| స్వీయ రచనలు: | 1) ఆంధ్ర వేదశాస్త్ర విద్యాలంకారులు, 2) జన వేమన 3) దర్శనీయ దేవాలయాలు, 4) శ్రీ హనుమత్ కథానిధి, 5) శ్రీ ఆంజనేయస్వామి |

మహాత్మ్యం, 6) సిద్ధ యోగి పుంగవులు, 7) మహిళా మాణిక్యాలు, 8) పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు, 9) దర్శనీయ దైవ క్షేత్రాలు, 10) గీర్వాణ కవుల కవితా గీర్వాణం,11) దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు, 12) కెమోటాలజి పిత కొలచల సీతారామయ్య, 13) దైవ చిత్తం

స్వీయ సంపదకత్వంలో... (సరసభారతి ప్రచురణలు): 1) జ్యోతిస్సంశ్లేషణం, 2) ఉయ్యూరు ఊసులు, 3) నవ కవితా వసంతం, 4) మా అక్కయ్య, 5) ఆదిత్య హృదయం, 6) త్యాగి పే"రెడీ"లు+,7) శ్రీరామ వాణి, 8) సాహితీ స్రవంతి (సాహితీమండలి కోసం).

వ్యాపకం: శ్రీ సువర్చలాంజనేయస్వామి దేవాలయ వంశపారంపర్య ధర్మకర్త- స్వామి సేవలో ధన్యత. అనునిత్య సాహితీ వ్యాసంగం

అక్కా, బావ: వేలూరి దుర్గ- వివేకానంద్

తమ్ముడు, మరదలు: కృష్ణమోహన్- సునీత

సంతానం: 1) గబ్బిట మృత్యుంజయశాస్త్రి, సమత
(సంకల్ప్, భువన సాయి తేజ)
2) లక్ష్మి నరసింహశర్మ, ఇందిర
(శ్రీహర్ష సాయి, హర్షితాంజని)
3) నాగ గోపాల కృష్ణమూర్తి, రాణి
( గౌతమ్ శ్రీచరణ్, రమ్య)
4) వెంకట రమణ, మహేశ్వరి
5) కోమలి విజయలక్ష్మి, సాంబావధాని
( శ్రీకేత్, అశుతోష్, పీయూష్)

# దైవ చిత్త దర్శనానికి యివీ సోపానాలు



# దైవ చిత్తం

శ్రీ ఏ.సి.పి.శాస్త్రి గారి **"The Mind Of God"**కు స్వేచ్ఛానువాదం

**"పు**రాణాలను శాస్త్రీయంగా విశ్లేషించి, వివరించి, జన సామాన్యంలోకి వ్యాప్తి చేయాలన్న కోరిక చాలా కాలంగా నాలో ఉండిపోయింది. అందుకనే చాలా వినయంగా నాకు సాధ్యమైన రీతిలో దీన్ని ముద్రిస్తున్నాను. దయచేసి చదవండి. నచ్చకపోతే పక్కన పారేయండి. మనసుకు నచ్చితే కొనసాగించండి" అని శాస్త్రిగారు చదువరులకు మనవి చేశారు. ఈ పుస్తకం నిన్న సాయంత్రం నాకు వారి మిగిలిన పుస్తకాలతో బాటు అందజేసారు. దీనిలోని ముఖ్య విషయాలు తల స్పర్శగా మాకు తెలియజేశారు. పుస్తకాన్ని చేతిలోకి తీసుకొని "దీన్ని నేను తెలుగులోకి అనువదించి సాహితీ బంధువులకు అందజేస్తాను" అని అనగానే శాస్త్రిగారు రెండు చేతులు జోడించి "మహద్భాగ్యం" అన్నారు. అందుకే ఉదయం వారి గురించి "చిన పున్నయ్యే కాని పెద్ద పూర్ణ ప్రజ్ఞ శాస్త్రి" వ్యాసం రాసి వారి బహుముఖీన ప్రతిభా పాండిత్యాల గురించి వివరించాను. ఇప్పుడీ అనువాదాన్ని అందజేస్తున్నాను. ఇదీ 'దైవ చిత్తం'కు నేపథ్యం. వారికి మన సరసభారతి గ్రంథాలను బహూకరించాను.

# దైవచిత్తం

కొన్నేళ్ళ క్రితం ప్రపంచ ప్రసిద్ధ శాస్త్రవేత్త స్టీఫెన్ హాక్ రాసిన 'ఎ బ్రీఫ్ హిస్టరి ఆఫ్ టైం" పుస్తకం చూసి చదివాను. అయ్యో ఒక దశాబ్దం ఆలశ్యంగా దీన్ని చదివానే అని బాధ పడ్డాను. దీన్ని బాంటాం ప్రచురణ సంస్థ 1988లో ప్రచురించింది. సహజంగా నేను సైన్సు వాడిని కాను. సైన్స్‌లో ఏ శాఖలోనూ ప్రవేశం ఉన్నవాడినీ కాదు. మీ చేతులో ఉన్న ఈ చిన్న పొత్తంలో ముఖ్యంగా కాస్మోలజిపై చర్చ ఉంటుంది. దీనికి గణితం, భౌతిక, రసాయన శాస్త్రాలు సహకరిస్తున్నాయి. క్లాసికల్ సైన్స్‌లలో శిక్షణ పొంది పండిపోయిన వారు చేయాల్సిన పని ఇది. నాబోటి శిక్షణ లేనివారు చేబట్టాల్సినది కాదు. దీనిని రాస్తూ పోతుంటే సుమారు 45 ఏళ్ళ క్రితం డిగ్రీలో చదివిన సామాన్య శాస్త్ర విషయాలన్నీ గుర్తుకొస్తున్నాయి.

భారతీయ పరంపరాగత వేదసాహిత్యంలోని విజ్ఞానం, పురాణాలలోని కీలక భావనలను "బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైం"లోని నిర్ణయాలను సమన్వయం చేసి ఈ పుస్తకాన్ని రాస్తున్నాను. వీటిలోని పోలికలు, సమన్వయము, విరుద్ధ భావనలను దృష్టికి తెస్తున్నాను. వేద విజ్ఞానంలోని, బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైంలోను బాగా కొట్టొచ్చేట్లే కనిపించే ప్రతీకలలో ఉన్న పోలికలను సూచిస్తున్నాను. సైన్స్‌లో ఆవిష్కరింపబడిన మహా సిద్ధాంతాలు కూడా తప్పకుండా పునశ్చరణకు లోను కావాల్సిందేనని మన అనుభవాలు తెలియజేస్తున్నాయి. మానవుడు నిరంతరం తార్కిక, శాస్త్రీయ ఆలోచనా శీలి అని, ఇదే అభివృద్ధికి చిహ్నం అని మనం భావించాలి. ఈ పుస్తకంలోని కొన్ని సిద్ధాంతాలను ఆ తర్వాత అవసరాన్ని బట్టి మార్చాల్సి వచ్చింది. చర్చ సుగుణాత్మకమై వేద భావనలను పోలి ఉంటేనే ఈ మార్పు చేశాను. అనుమానాలకు తావు లేకుండా సైన్సు సిద్ధాంతాలు స్థాపింపబడే వరకు భారతీయులు వేద దృక్పథమే సరైనదని భావించి నమ్మేవారు. సైన్సు కూడా ఇవాళ కాకపోతే రేపైనా ఇవే నిర్ణయాలు చేస్తుందని వారి ప్రగాఢ విశ్వాసం. సైన్సు రంగంలోని సిద్ధాంత విలువలపై ఈ పుస్తకం అపార గౌరవ భావాన్ని కలిగి ఉంది.

ఈ సందర్భంగా ఒక విన్నపం. నాకు కనిపించిన పోలికలు బహుళ ప్రచారంలో ఉన్నవే. ప్రతి భారతీయుడికి తెలిసినవే. సైన్సు పరిశోధనా ఫలితాలను హిందూ వేద విజ్ఞానానికి అంటగట్టి సైన్సును చులకనగా చూస్తున్నానని కొందరికి అనిపించవచ్చు. ఏదైనా సత్యానికి దూరం కాదు కదా. వేద భావనలు అతి

సహజంగా, సరళంగా ఈనాడు కనిపిస్తున్నాయి. ఇవి ఎంతోకాలం క్రితమే ఈ నమ్మకాలు మన సమాజంలో విలువ కలిగి మెదడులలో ఉండిపోయిన విషయం మనకు జ్ఞాపకం వస్తుంది. అందుకనే అవి సహజాతాలు అనిపిస్తున్నాయి. ఇది కాంతిలో ఏడు రంగులున్నట్లుగా కనుగొన్నట్లే అనిపించేటట్లు, అదొక కొత్త విషయమే కాదన్నట్లుగా ఉంటుంది. ఈ విషయాన్ని కనిపెట్టి కొన్ని శతాబ్దాలు అయిపోయి మానవ మనసులలో నిలిచిపోయి అదేదో అద్భుత విషయం కాదని అతి సమాన్యమైనదేనని అనిపిస్తుంది. అంతమాత్రం చేత ఆ ఆవిష్కరణను తక్కువ చేయటంగా భావించినట్లా? పూర్వకాలంలో చదువులు వృత్తిపరమైనవిగా (ప్రొఫెషనల్)గా ఉండేవి. ఈ వృత్తికి చెందని వారికి సంస్కృతంతో పరిచయం ఉండేదికాదు. వీరికి వీటి విషయమై అవగాహన కల్పించటం కోసం, రాయటానికి భద్ర పరచటానికి తగిన సౌకర్యాలు లేని కాలంలో ఈ కీలక భావలను మత సంబంధమైన కార్యాలలో, ఉత్సవాలలో పూజాదికాలలో నిక్షిప్తం చేసి పరం పరాగతంగా తర తరాలకు అందజేయటం జరిగింది. చదువుకొన్న వారికే గ్రంథాలలోని విషయాలు తెలిసేవి. ఈ రోజుల్లో మనం గ్రంథాలయాలకు వెళ్ళి తెలియని విషయాలను అవగాహన చేసుకొంటున్నట్లే. ఆనాడు చదువు రానివారు పండితుల వద్దకు వెళ్ళి సార్వకాలీక సత్యాలను తెలుసుకొనేవారు. అచ్చు యంత్రం కనిపెట్టేంత వరకు అన్ని దేశాలలో అన్ని నాగరికతలలో ఇదే విధానం అమలులో ఉండేది. కనుక దయచేసి నేను పోలికలపై చేసిన వ్యాఖ్యలను మొదటిసారి పుస్తకం చదివినట్లు శ్రద్ధగా చదవవలసినదిగా మనవి చేస్తున్నాను. అవి బాగా పరిచయమైనవే అయినా తిరస్కరింప బడాల్సినవి కావని గ్రహించండి. మొదట అధ్యాయాల వారీగా విషయాన్ని వివరిస్తున్నాను. ముందు అందులోని అంశాలను తెలియజేసి తర్వాత నా వ్యాఖ్యానం రాస్తున్నాను. ఇది అందరికి సుబోధకంగా ఉంటుందని నా నమ్మిక.

## మొదటి అధ్యాయం– మన విశ్వ దృశ్యం

"బహుశా ప్రముఖ సైంటిస్ట్ బెర్ట్రాండ్ రసెల్ అనుకుంటా ఒకసారి ఖగోళ శాస్త్రంపై ఉపన్యాసం చేశాడు. భూమి సూర్యుని చుట్టూ ఎలా తిరుగుతుందో, ఎలా సూర్యుడు అనేక నక్షత్ర సముదాయాలతో ఉన్న మన గెలాక్సీ కేంద్రం చుట్టూ పరిభ్రమిస్తాడో వివరించాడు. ఉపన్యాసం అంతా విని చివరలో ఒక ముసలావిడ ఆయనతో "మీరు చెప్పింది అంతా చెత్తగా ఉంది. ప్రపంచం నిజంగా సమతలంగ

ఉండి, ఒక బలిష్టమైన తాబేలు వీపు మీద ఆధారపడి ఉంది" అన్నది. అప్పుడు ఆ సైంటిస్ట్ ఆశ్చర్యకరమైన ఒక చిరునవ్వు చిందించి "అలా అయితే ఆ తాబేలు దేనిమీద నిలబడిందమ్మా?" అని ప్రశ్నించాడు. దానికామె "నువ్వు తెలివైన యువకుడివని అర్ధమైంది నాయనా. అదెప్పుడూ కిందనే ఉంటుంది బాబూ" అన్నది చిర్నగవుతో రసెల్‌ను హేళన చేస్తూ విజయ విలాసంగా.

**దీనికి శాస్త్రిగారి వాఖ్యనం–** భారతదేశంలో వ్యాపించి ఉన్న కూర్మావతారం విశేష విషయం యూరప్ దేశాలలోకి ఎలా ఎప్పుడు పాకిందో, అమెకెలా తెలిసిందో వింటే ఆశ్యర్యమేస్తుంది. భూమి ఆది కూర్మం వీపు మీద నిలిచి ఉన్నది అనేది మనకు అతి సామాన్యమైన విషయమే. తరతరాలుగా వింటున్నదే. సాహిత్యంలో ప్రాచీనమైనదైన భాగవత పురాణంలోని సృష్టికర్త దశావతారాలను ధరించాడని వర్ణింప బడింది. విష్ణుమూర్తి మొదటి అవతారంలో "బృహత్ మీన రూపం" ధరించాడు. మీనం అంటే చేప. చేపకు పురాణాలు "ధి" అనే సంజ్ఞ నిచ్చాయి. అట్లే వివేకానికి చేప ప్రతీక అన్న మాట. విష్ణువు లేక సృష్టికర్తకు శత్రువైన సోమకాసురుడు వేదాలను అపహరించి ద్వంసం చేయబోతే వాడిని చంపి వేదోద్ధరణ చేశాడు. అంటే బుద్ధి లేక వివేకం నశించకుండా రక్షించాడు. రెండవ అవతారమే "మహా కూర్మావతారం". దీని అవసరానికి సంబంధించిన ఒక కథ పురాణాలలో ఉంది. దైవానికి ఇష్టులైన దేవతలు, ఆయన శత్రువులైన అసురులు అనాదిగా పోరాటం సాగిస్తూనే ఉన్నారు. ఇరువైపులా ఈ అనంతకాల యుద్ధంలో లెక్కకు మించి చనిపోయారు. చనిపోయిన దేవ, రాక్షసులను పునర్జీవితులను చేసే ఔషదం వైద్య విధానం అప్పటికి ఇంకా రాలేదు. దీనికోసం ఇరువైపులవారు సంప్రదించుకొని, రాజీ పడి పాల సముద్రాన్ని మధించి చావులేని అమృతాన్ని పొందటానికి అంగీకరించారు. మధించే కవ్వంగా మంధర పర్వతాన్ని, మహా సర్పమైన వాసుకిని రజ్జువు అంటే త్రాడుగా ఎంచుకొని క్షిరసాగర మధనం ప్రారంభించారు. పర్వతం బరువు వల్ల సముద్రంలోకి కుంగిపోతుంది. ఏం చేయాలో తెలీక విష్ణువుని ప్రార్థిస్తే, ఆయన కూర్మ రూపం ధరించి తన వీపు మీద మందరాన్ని అని ఉండేట్లు చేయించి మళ్ళీ చిలకటం ప్రారంభించమన్నాడు. ఇలా అమృతం సంపాదించటానికి "వారింగ్ గ్రూప్స్" ఏకమైనాయి. ఆ తర్వాత హాలాహలం, చింతామణి కల్ప వృక్షం, చివరికి అమృతం రావటం మనకు తెలిసిన కథయే.

ఇంతవరకు బాగానే ఉంది. ఈ పురాణ కథ ఐరోపా దేశానికి చేరిందని

తెలిసి, మనకు ఉత్సాహంగానే కాక ఆశ్చర్యంగా కూడా ఉంది. ఎప్పుడు ఎలా అక్కడికి చేరిందో తెలీదు మనకు. డేవిడ్ ఫ్రాలీ, శుభాష్ కాక్‌లు తమ "ఇన్ సెర్చ్ ఆఫ్ క్రేడిల్ ఆఫ్ సివిలైజేషన్– (నాగరికత ఉయ్యాల అన్వేషణ కోసం) అనే పుస్తకంలో ఈ కథతోబాటు మిగిలిన మన పురాణ గాథలు ఇండియా నుండే యూరప్ చేరి ఉండవచ్చు.

ఈ కూర్మావతార గాథ ప్రతీకాత్మకమైన కాస్మిక్ (అంతరిక్ష) కథ. ఇందులో స్థిరమైన సృష్టి పరిణామ సంఘటన నిక్షిప్తమై ఉంది. పాల సముద్రం అంటే ఆకాశంలోని నక్షత్ర సముదాయమైన మిల్కీ వే (పాలపుంత) అని అర్థం. మధనానికి తాడుగా ఉన్న వాసుకి సర్పం గమనానికి సహకరించే దీర్ఘ వృత్తాకార (ఎలిప్టికల్) లేక వృత్తాకార మార్గానికి సంకేతం. ఈ పుస్తకంలోనే రాబోయే అధ్యాయాలలో గురుత్వాకర్షణ కంటికి కనిపించని బిందు సముదాయాల చేత పొందే మార్పు అని తెలుసుకొంటాం. మంధర పర్వతం అంటే అయస్కాంతం ధృవం లేక మధనానికి సహకరించే పాలపుంత కేంద్రం. మధనంలో వెలువడిన హాలాహలం లేక గరళం అంటే ఓజోన్ వాయువు. గరళం తర్వాత వచ్చిందే అమృతం అంటే ప్రాణ వాయువైన ఆక్సిజన్, నీరు. ఇదీ పాల సముద్రం చిలకటంలో ఉన్న అంతర్యం. ఈ కథను ఇంత వివరంగా చర్చించటానికి కారణం– రాబోయే అధ్యాయాలలో స్టీఫెన్ హాకింగ్ శాస్త్రజ్ఞుడు "సృష్టి ఆశ్చర్యకరంగా (సింగ్యుటారిటి)" అని చెప్పే సిద్ధాంతాన్ని వివరించటం కోసమే. దీనినే "సింగులారిటి అన్నాడు. అంటే అంతరిక్షంలో ఒక బిందువు (పాయిట్ ఇన్ స్పేస్). అంటే టైం– స్పేస్ కర్వేచర్ (వక్రరేఖ) అనంతంగా మారిపోతుంది. స్పేస్‌టైంను వక్రరేఖగానే భావిస్తారు కాని సరళ రేఖగా కాదు. ఇప్పటి ఈ పురాణ ప్రతీక కథనం సృష్టి కాల ప్రారంభాలను వివరిస్తుంది. ఇందులో కూర్మాన్ని ఎందుకు ఎంచుకొన్నారు అనే ప్రశ్న రావటం సహజం. అది పైన ఉన్న గుల్ల (షెల్) వలన గుల్ల నీటిపై భాగాన ఉంచుతూ నీటిలో ఈదగలుగుతుంది. అంతే కాక అది పాలపుంతకు ప్రతీకగా గ్రహించబడింది. దాని వీపు వక్రంగా ఉంటుంది కనుక స్పేస్ మరియు కాలానికి ఉమ్మడి సంకేతంగా తీసుకోబడింది. ఈ వక్రత అనంతం అని కూడా భావించి గ్రహించారు. మనం ఇప్పుడు మాట్లాడుకొనే స్పేస్ టైం వక్ర రేఖ రెండు పరిణామాల (టు డై మన్షనల్) యూక్లిడ్ భావనా రేఖాచిత్రం (గ్రాఫ్). మహా కూర్మం లేక ఆది కూర్మం వీపును ఎంచుకోవటానికి కారణం– టైం, స్పేస్‌లు సరళ రేఖా మార్గాలు కావని, చక్రీయాలు (సైక్లిక్) అనీ సూచించటానికే అని గ్రహించాలి. ఈ పుస్తకంలోనే

తర్వాతి అధ్యాయాలలో ఈ స్పేస్ టైం కర్వ్ చాలా పెద్దదని, అనంతమైనదని అప్పుడది ఒక సరళ రేఖగా గోచరిస్తుందని చెప్పబడింది. అంటే స్పేస్, టైం ఒక సరిహద్దుగా, సరళంగా (లీనియర్) ఉంటుందన్నమాట. వీటికి తగిన సరైన పదాలను ఈ క్రింద వివరించబడినాయి.

పేజీ 46 పేరా 2

సైన్స్‌లోని అన్ని సిద్ధాంతాలు స్పేస్, టైంలు సరళమైనదనీ దాదాపు సమతలమైనదీ అన్న ఊహలపై ఏర్పడినవే. ఇవి బిగ్ బాంగ్ ఏకత్వంతో తెగిపోయి అక్కడ స్పేస్, టైం వక్రత అనంతం అనే అభిప్రాయం స్థిరపడింది.

**పేజీ 1330 పేరా 02**

ఈ విశ్వం ఎలా ఆవిర్భవించింది అని ఊహించి చెప్పటానికి కాలం ప్రారంభం నాటి సూత్రాలు అవసరం. సాధారణ సాపేక్ష సిద్ధాంతం నిజమైతే, రోజర్ పెన్రోజ్ చెప్పిన సింగ్యులారిటి సిద్ధాంతాలు, నేను ఋజువు చేసిన కాలం ప్రారంభంలో ఒక అనంత సాంద్రత, అనంత వక్రరేఖలో ఒక బిందువు. ఈ పాయింట్ దగ్గర సైన్స్‌కు సంబంధించిన సకల సూత్రాలు ఆగిపోతాయి (బ్రేక్ డౌన్).

**శాస్త్రి గారి వ్యాఖ్య–**

భారతీయ పురాణ కథనం ప్రకారం మహా కూర్మం లేక ఆది కూర్మం అంటే తాబేలు జీవులన్నిటిలో ఎక్కువ ముసలిది అదే స్పేస్– టైం లకు ప్రతీక. అదే సృష్టి ప్రారంభానికి నాంది. స్పేస్, టైంలు ఒక సరళ రేఖ కాకపోతే, భూమి సరళ రేఖగా ఉన్న త్రిభుజా కార మంధర పర్వతం కూర్మం వీపుగా స్థిరంగా నిలబడేది కాదు. మథనానికి వీలు కలిగేదీ కాదు. ఈ కథలో ఇన్ని ప్రతీకలున్నాయి. ఈ ప్రతీకలనాధారంగా మన పురాణాలు వేద విజ్ఞానాన్ని కథా రూపాలలో కరతలామలకం చేశాయి. వివరించే చెప్పే సామర్థ్యం ఉన్నవారుంటే అంతా జుర్రుకొనే జుంటి తేనే.

**పేజీ 11, పేరా 0**

కనుక అందుకని ప్రారంభ దశకు చెందిన సూత్రాలు ఉన్నాయి.

**వ్యాఖ్య–** పదార్థ విషయంలో భారతీయ వేద భావాలకు ఇది తక్కువస్థాయిలో కనిపిస్తుంది. పురాణాల ప్రకారం సృష్టికర్త అయిన చతుర్ముఖ బ్రహ్మ వేద విధి ననుసరించి సకల సృష్టినీ చేశాడు. ఆయన భూమిని సృష్టించబోయే ముందు

"భూ" అనే శబ్దాన్ని ప్రవచించాడు. అంతే భువి సృష్టింపబడింది. బ్రహ్మ చేసే సృష్టికి ముందే భూ అనే శబ్దం ఎక్కడి నుంచి వచ్చింది? అనే సందేహం రావటానికి అవకాశం ఉంది. వేదాలు సార్వకాలికమైనవి అని వేదం చెప్పింది. అంటే వేద సూత్రాలు బ్రహ్మకు ముందే ఉన్నాయన్నమాట. బ్రహ్మ వాటిని పునశ్చరణ చేసుకొని, సృష్టికార్యం యధా ప్రకారం చేశాడు. దీన్నిబట్టి మనకు తెలిసేది ఏమిటి? అంటే జ్ఞానానికి స్పేస్, టైం లు విధేయత కలిగి ఉంటాయని (సబార్డినేట్) వేద పరిభాషలో జ్ఞానం అంటే భగవంతుడే. జ్ఞానం లేకుండా కాలం అనేది ఎప్పుడూ ఉండదు, లేదు కూడా. అది కాలాతీతం. భూత వర్తమాన భవిష్యత్ లన్నిటిలోనూ జ్ఞానం ఉంటుంది. దీనినే వేదం "సత్యం" అన్నది. "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అని ఉపనిషత్ చెప్పింది. అనంతమైన జ్ఞానమే పరమ పురుషుడు. ఆయన త్రికాలాలలోను ఉంటాడు అని వేదం యే అనుమానాలకు తావు లేకుండా పేర్కొన్నది.

**పేజీ 12, పేరా 02**

ఇప్పుడు విశ్వం ఏక పక్షమైనది సర్వసత్తాకమైనది (ఆర్బిట్రరి). అది కొన్ని నిర్దుష్ట సూత్రాలకు లోబడి పని చేస్తుందని, చివరికి పాక్షిక సిద్ధాంతాలను, పూర్తిగా ఏకరీతి సిద్ధాంతంగా మార్చి అధ్యయనం చేస్తేనే ఈ విశ్వంలో ఉన్నది అంతా వర్ణించి చెప్పటానికి వీలవుతుంది.

**శాస్త్రి గారి భాష్యం–** ఈ ఏకీకృత సిద్ధాంతం రాబట్టటానికి ఆధునిక విజ్ఞాన శాస్త్ర పరిశోధన తార్కికమైనదీ, సాంకేతిక పరమైనదీ మాత్రమే అవుతోంది. ఈ యూని ఫైడ్ థీరీ (ఏకీకృత సిద్ధాంతం) సృష్టి ప్రారంభాన్ని, సృష్టి అంతాన్ని వివరించటానికి బిగ్ బాంగ్, బిగ్ క్రంచ్ సిద్ధాంతం శరణు జొచ్చారు. భారతీయ వేదాంతం సృష్టికి కారణభూతమైనదేమిటో (జగత్కారణం) వివరంగా చెప్పింది. అన్ని సిద్ధాంతాలను కలిపి ఏక సిద్ధాంతాన్ని చేసి అన్ని ప్రశ్నలకు సరైన సమాధానాలను చెప్పింది. సృష్టి ప్రారంభానికి ముందు ఎలా ఉన్నదో, సృష్టి చేస్తే యే విధంగా కనిపిస్తుందో, సృష్టి అంతం అయితే ఎలా దర్శనమిస్తుందో అన్నీ క్రిస్టల్ క్లియర్‌గా వివరించారు. ఇదే అద్వైత సిద్ధాంతం. సృష్టికి ఆరంభం అనేది కాని అంతం అనేది కాని లేదు అని అతి సాధారణమైన మాటలలో సుస్పష్టంగా వివరించి ఎరుక పరచింది అద్వైత సిద్ధాంతం. సృష్టి ప్రారంభం, తుది అనేవి మన లౌకిక దృష్టిలో మాత్రమే కనిపించే విషయం అన్నది, భగవంతుడు లేక పరమాత్మ ఈ

విశ్వరూపంలో దర్శనమిస్తాడు అన్నది పరమోత్క్రుష్ట భావన.

ఈ విశ్వాన్ని చూస్తూ దేవుడిని చూస్తున్నాము అని భ్రమ పడుతున్నాం. ఇదే సృష్టి అనుకొంటున్నాం. దీన్నే రజ్జు- సర్ప భ్రాంతి అంటున్నారు. తాడును చూసి పాము అని భ్రమ పడటం అన్నమాట. తాడు మార్పులేని నిర్వికారమైనది. కాని పాముకు ఆది అంతాలున్నాయి. ఇలా భ్రమ పడటమే వేదాంత పరిభాషలో "అవిద్య" అంటారు. ఇంద్రియ నిగ్రహం కలిగి చూస్తే ఏకాత్మ భావన కలిగి విశ్వం పరమాత్మ దర్శనమవుతుంది. దీనికి సాధన కావాలి. ఈ సర్వ సృష్టికి భాసించే భగవంతుడు కాలాతీతుడు, అనంతుడు, అవినాశి, అనంత శక్తి సంపన్నుడు. కనుక సృష్టి ప్రారంభ, అంతాలపై కలిగే ప్రశ్నలన్నిటికీ ఇదే అత్యుత్తమమైన సమాధానం.

## రెండవ అధ్యాయం- అంతరిక్షం, కాలం (స్పేస్ అండ్ టైం)

**పేజీ 18, పేరా 02**

నిజానికి న్యూటన్ శాస్త్రజ్ఞుడు అబ్సల్యూట్ స్పేస్ లేదు అన్నదాన్ని తిరస్కరించాడు. కాని ఆయన సూత్రాలలో ఇది ఇమిడే ఉంది. కాని కాదంటాడు. ఈ రకమైన అతార్కిక నమ్మకానికి అందరూ ఆయన్ను ఖండించారు. అందులో ముఖ్యంగా వేదాంతి, భౌతికంగా కనిపించేవన్నీ స్పేస్, కాలం అన్నీ భ్రాంతి పూర్వకమైనవే అని నమ్మిన బిషప్ బర్క్లీ తీవ్రంగా విరుచుకు పడ్డాడు.

**శాస్త్రిగారి శ్యాఖ్యానం-** బిషప్ బెర్క్లీ ఒక్కడే పాశ్చాత్య వేదాంతులలో భారతీయ వేదాంత భావన అయిన "మాయ"ను గుర్తించినవాడు. ఈ భావన 2, 500 సంవత్సరాల కిందటిదే. పంచేంద్రియాలలో మనం చూసే ఈ దృశ్య ప్రపంచం అంతా అసలైనది కాదు అనేది మాయా సిద్ధాంతంలో ముఖ్యమైన విషయం. అదొక భ్రాంతి అంటుంది. అసలు సత్యాన్ని దర్శించాలంటే మామూలు భౌతిక జీవనం జీవించేవారికి సాధ్యం కాదు. ఇంద్రీయాలను వశ పరచుకొని, మనసును స్థిరంగా ఉంచి చూస్తేనే ఏకాత్మ భావన కలిగి సర్వం ఖిల్విదం బ్రహ్మ అనే ఎరుక కలుగుతుంది. పాపం న్యూటన్ మహాశయుడు గణిత దృష్టి కోణంలో చిక్కుకొని సమస్యను పరిశీలించటం వలన సత్యదర్శనం చేయలేక పోయి ఉండవచ్చు. సృష్టికి భిన్నమైన సృష్టికర్తలను చూడలేకపోయాడు. అందుకే ఆబ్సల్యూట్ గాడ్‌ను నమ్మాడు. బర్క్లీ వేదాంతి కనుక ఈ పరిధి దాటి ఆలోచించి యదార్థాన్ని చెప్పగలిగాడు. ఈ

విశ్వం సరిహద్దులు లేని అనంతమైనది. అందులో ప్రతి బిందువు విశ్వానికి కేంద్రమే. విశ్వంలో స్పేస్‌లో టైం లు ఒకదానికొకటి పెనవేసుకొని పాయింట్ ఆఫ్ సింగ్యులారిటీని తెలియజేస్తాయి.

**పేజీ 19, పేరా 03**

గాలిలో శబ్ద తరంగాలు వ్యాప్తి చెందినట్లు కాంతి తరంగాలు ఈథర్‌లో ప్రయాణం చేస్తాయి. వీటి వేగం ఈథర్‌కు సాపేక్షంగా ఉంటుంది.

**శాస్త్రి గారి భాష్యం–** ఈథర్ సిద్ధాంతాన్ని అయిన్ స్టీన్ లాంటి ప్రముఖ శాస్త్రవేత్తలు ప్రక్కన పడేసి చాలా కాలమైంది. శబ్ద తరంగాలు గాలిలో ప్రయాణం చేస్తాయి అన్న విషయం వేద సాహిత్యంలో ఉండనే ఉంది. మనకు కొత్తదేమీ కాదు. భారతీయ అతి ప్రాచీన తర్క శాస్త్రం (లాజిక్)లో శబ్దం ఆకాశం యొక్క (స్పేస్) గుణం అని ఉంది. అంటే ఆకాశం శబ్ద తరంగాలను సృష్టిస్తుంది. పంచభూతాలలో ఒకటి అయిన ఆకాశం (స్పేస్) తర్వాత సృష్టింపబడినది గాలి అనే మరో భూతం. ఇదే శబ్దానికి వాహకంగా ఉండి శబ్ద తరంగాలను ఆకాశం ద్వారా ప్రసారం చేస్తుంది. ఈ విషయాన్నే ఉపనిషత్ "ఆకాశాద్వాయుః వాయోరగ్ని" అని చెప్పింది అంటే ఆకాశం నుండి వాయువు అంటే గాలి, గాలి నుండి అగ్ని సృష్టింపబడినాయి అని అర్థం.

**పేజీ 20, పేరా 02**

ఏమైనా 1905లో ఒక ప్రముఖ పత్రిక ఇప్పటిదాకా ఎవరికీ తెలియని స్విస్ పేటెంట్ ఆఫీస్‌లో పనిచేసే గుమస్తా ఆల్బర్ట్ అయిన్ స్టీన్ ఈథర్ అనే మొత్తం భావన అనవసరం అనీ దీనితో ఆబ్సల్యూట్ టైం అనే అభిప్రాయాన్ని పరిత్యజించాలి (అబాండన్) అని సూచించాడు.

**శాస్త్రి గారి వ్యాఖ్య–** వేద భావనలో కాలం అబ్సల్యూట్ (పరిపూర్ణం) కాదు. భారతీయులు కాని పాఠకులు విష్ణుమూర్తిని అనంతుడని పిలువబడే ఆదిశేషుడు అనే పాము తల్పంపై పాల సముద్రంపై శయనించి ఉన్నట్లు ఉండే చిత్రాన్ని చూసి ఉంటారు. ఇక్కడ పాల సముద్రం అంటే ఈ విశ్వమే. అదే అంతరిక్షంలోని పాలపుంత గెలాక్సీ అనే నక్షత్ర సముదాయానికి చిహ్నం. శేషుడు కాలానికి ప్రతీక. సంస్కృతంలో శేషం అంటే మిగిలి ఉన్నది అని అర్థం. సృష్టి అంతా లయం అయినప్పుడు కాలం ఒక్కటే మిగిలి (శేష) ఉంటుందని భావం. భారతీయ

దార్శనిక పరిభాషలో కాలం చుట్టగా (స్పైరల్)గా ఉంటుంది అని సరళ రేఖాత్మకం కాదని చెప్పారు. కనుక ఇక్కడ శేషుడు చుట్టలు చుట్టుకొని ఉండటం దీనినే సూచిస్తుంది. వేద జ్యోతిష సిద్ధాంతం ప్రకారం మనకు ప్రభవ మొదలైన 60 సంవత్సరాలున్నాయి. అవి ఒక అవర్తనం పూర్తికాగానే మళ్ళీ మొదలౌతాయి. అదీ మన ప్రత్యేకత. ఇదే యుగాలు. మహా యుగాలు, కల్పాలు, విషయంలోనూ జరుగుతుంది. భారతీయ వేద ఖగోళశాస్త్రం సృష్టి ప్రారంభం, అంతాలతో కాలం అనంతంగా పునరావృత్తమౌతుంది. దీనికి తుది అనేది లేనే లేదు. ఎందుకంటే మొదలు అనేది ఉంటేగా అంతం ఉండేది. కనుక సృష్టికి కాలానికి తుది మొదలు అనేవి లేనే లేవు అని నిర్ద్వందంగా భారతీయ ఖగోళ వేద విజ్ఞానం తెలియజేసింది. కనుక పాశ్చాత్య భావన అయిన కాలం పరిపూర్ణం (అబ్సల్యూట్) అనే దాన్ని భారతీయ వేద శాస్త్రాలు పరిగణనలోకి తీసుకొనే తీసుకోవు.

ప్రతి పరిశీలకుడు స్వయంగా తనతోపాటు తీసుకువెళ్ళిన గడియారంతో కాలాన్ని కొలిచి రికార్డ్ చేసుకోవటం గమనించబడింది. ఈ గడియారాలు ఒకే తీరుగా ఉన్నప్పటికీ అవి రికార్డ్ చేసే కాలాలు ఒకే మాదిరిగా లేవు.

**శాస్త్రిగారి వివరణ–** భారతీయ లాజిక్ అనబడే తర్కశాస్త్రం పూర్వమే మనం అనుసరించే గంటలు, రోజులు మన కనురెప్పల తెరవటం మూయటంలతో, సన్ డయల్ మొదలైన వాటి ద్వారా కనుగొనేవారని తెలియజేసింది. కాలంను "విభువు" అంటారు. అంటే అఖండం అని అర్థం. అన్నం భట్టు రాసిన తర్క సంగ్రహ గ్రంథంలో "అతీతాది వ్యవహార హేతు హు కాలః, సా చైకో విభు రనిత్యహః". కాలం జరిగిన, జరగబోయే దాని వ్యక్తీకరణకు కారణమవుతుంది. కాని అది అఖండం. సర్వ వ్యాపకం. విభూ అంటే అదే.

**పేజీ 23, పేరా 1**

కాలం పూర్తిగా వేరైనది, ఆకాశం కంటే స్వతంత్రమైంది కాదని, దానితో కలిసే ఉంటుందని దీనివలననే స్పేస్ టైం అనేది ఏర్పడుతుంది.

**వ్యాఖ్య–** భారతీయ వేదాంతులు కవులు భగవంతుని ఈ కింది విధంగా స్తోత్రం చేశారు.

"భగవానుని రూపం అనంతమైన విశ్వం. అది దేశ కాలాలచేత విభజింప బడేది కాదు. దేశ కాలా భేద్యం. ఆత్మతో మాత్రమే పరమాత్మను చూడగలం. అనుభవించగలం. ఆయనను సృష్టిలో కనిపించే ప్రతి ఉత్కృష్ట వస్తువుతో

పర్యాయపదంగా అర్థంగా భావిస్తారు. భారతీయ సాహిత్యంలో ఈ రెండిటిని కలిపే చెప్పారు. సత్యంపై వారికున్న తపన ఈ రెంటి విషయమై తీవ్ర ఆలోచనకు గురిచేసే దేవుడు వీటికి అతీతుడు అని స్పష్టంగా నిర్ణయించి చెప్పాయి. దీనికి సంబంధించిన భర్తృహరి కవి సంస్కృత శ్లోకం–

"దిక్కాలా ధ్యా న్యవ చిన్నానత చిన్మాత్రా మూర్తయే– స్వాను భూత్యేక మనయ నమస్సంతాయ తేజసే"

దీని అర్థం– భగవంతుడు దేశ, కాలాలకు సంబంధించినవాడు కాదు. వాటిచేత విభజింపబడే వాడూ కాదు. ఆయన సర్వ విజ్ఞానానికి మూర్తిమత్వం. ఆయనను ఎవరికి వారు స్వయంగా అనుభవంతో (స్వానుభవంతో) మాత్రమే తెలుసుకొని దర్శించగలరు. జ్ఞానం, దానికి ఆవలి దానితో మాత్రమే ఈ అనుభూతి పొందగలం. ఆయన భక్తులకు ఆ అనుభవం, ప్రశాంతి అనుగ్రహించే ఆయనకు ప్రణామాలు.

దిక్ ఆకాశం (స్పేస్), కాలం టైం ఈ రెండూ వ్యావహారికంలో ఉపయోగపడేవి. అన్నంభట్టు తంత్రసారంలో వీటికి చక్కని నిర్వచనాలు చెప్పాడు.

కాలం– "అతీతాది వ్యావహార హేతు హు కాలహంసా చికో విభుర్నిత్యః ఆకాశం కూడా అనంతమైనదే– అఖండమే అంటే విభు. మనకున్న 8 లేక 10 దిక్కులు మన నిత్య జీవిత వ్యవహారంలో ఉపయోగించేవే. దిక్ కూడా అనంతమే కాదు నిత్యమై శాశ్వతమైనదే. కనుక దేశ కాలాలు అభేద్యమై శాశ్వతమైనవి. కనుక రెండూ వేరు వేరు కాదు. రెండూ ఒక్కటే. ఈ విషయాన్ని మన తర్క పండితులు వేలాది సంవత్సరాల క్రితమే స్పష్టంగా తెలియజేశారు.

**పేజీ 28, పేరా 01**

ఉదాహరణకు– సూర్యుడు ఇప్పుడు ఈ క్షణంలో ప్రకాశించటం మానేశాడు అంటే, అది అప్పటికప్పుడు భూమిపైనున్న వస్తువులపై ప్రభావం చూపదు. ఎనిమిది నిమిషాల తర్వాతే దాని ప్రభావం భూమిపై కనిపిస్తుంది. కారణం సూర్యకిరణాలు భూమికి చేరటానికి 8 నిమిషాలు పడుతుందని మనకు తెలుసు. అలాగే మన విశ్వానికి అత్యంత దూరంలో ఉన్న గెలాక్సీల కాంతి అవి కొన్ని మిలియన్ సంవత్సరాలకు ముందు విడుదల చేసిన కాంతి మాత్రమే అని మనం గ్రహించాలి. సుమారుగా 8 వేల మిలియన్ సంవత్సరాల క్రితం కాంతిగా శాస్త్రజ్ఞులు భావించారు. ఇప్పుడు మనం చూస్తున్న విశ్వం ఎప్పుడో పూర్వం ఉన్న విశ్వం అన్న మాట యదార్థం.

**పేజీ 32, పేరా 03**

సాధారణంగా సాపేక్ష సిద్ధాంతంలోని ఒక ఊహ ఏమిటంటే– భూమిలాంటి అతి భార పదార్థాల వద్ద కాలం నెమ్మదిస్తుంది. కాంతి శక్తికి దాని ఫ్రీక్వెంసికి (పౌనః పున్యం)కు ఉన్న సంబంధమే దీనికి కారణం. శక్తి పెరిగితే ఫ్రీక్వెంసి పెరుగుతుంది. కాంతి భూమి యొక్క గురుత్వాకర్షణ శక్తి క్షేత్రానికి పైన ప్రయాణిస్తే, అది కొంత శక్తిని కోల్పోయి, దాని ఫ్రీక్వెన్సి కూడా తగ్గిపోతుంది. కనుక దీనికి పై ఉన్నవారికి కింద ఉన్నచోట ప్రతిదీ ఆలశ్యంగా జరుగుతున్నట్లు అనిపిస్తుంది.

**శాస్త్రీజీ భాష్యం–** అందుకే మన వేద వేత్తలు భూమి మీద నెల, సంవత్సరం మొదలైన వాటికీ పితృలోక, దేవలోక వాసుల వారి కాలానికి చాలా తేడా ఉన్నట్లు గమనించి చెప్పారు. భూమిపైన ఒక నెల కాలం పితృలోక వాసులకు ఒక పగలు, ఒక రాత్రి మాత్రమే. ఇక్కడి ప్రతి పక్షం అక్కడ రోజులో సగం మాత్రమే. దేవలోక వాసులకు భూలోక సంవత్సరం ఒక్కరోజు మాత్రమే. అందుకే పితృ తర్పణం ప్రతి నెలకోసారి, దేవతల ఉత్సవాలు సంవత్సరానికి ఒకసారి చేస్తారు.

**పేజి 33, పేరా 02**

న్యూటన్ సూత్రాలు ఆబ్సల్యూట్ పొజిషన్ ఆఫ్ స్పేస్‌కు స్వస్తి చెప్పాయి. రిలేటివిటి సిద్ధాంతం ఆబ్సల్యూట్ టైంకు మంగళం పాడింది. ఒకే ఈడున్న ఒక జంట కవలపిల్లలను ఉదాహరణగా తీసుకొందాం. అందులో ఒకడు దూరంగా ఒక పర్వతాగ్రాన పెరుగుతున్నాడని, రెండవ వాడు సముద్ర తీరంలో పెరుగుతున్నాడని భావిద్దాం. కొన్నేళ్ళ తర్వాత చూస్తే మొదటివాడు రెండవవాడి కంటే ఎక్కువ వయసు పెరిగినట్లు గ్రహిస్తాం. వాళ్ళిద్దరూ కలిస్తే మొదటివాడు రెండవ వాడికంటే పెద్దవాడు అనిపిస్తాడు. వయోభేదం ఇక్కడ చాలా తక్కువగా ఉండచ్చు. కాని ఇందులో ఒకడు చాలాకాలం చాలా దూరంలో స్పేస్ షిప్‌లో కాంతి వేగంతో సమానంగా ప్రయాణించి వచ్చాడని అనుకొంటే, వీడి వయసు భూమి మీద ఉన్నవాడి వయసుకంటే చాలా తక్కువగా ఉన్నట్లు, చిన్నవాడుగా ఉన్నట్లు అనిపిస్తుంది. దీనినే "ట్విన్స్ పారడాక్స్" అంటారు. ఇది ఒక ఆభాస (పారడాక్స్) మాత్రమేనని ఆబ్సల్యూట్ టైంపై అవగాహన ఉన్నవారికి తెలుస్తుంది. థీరీ ఆఫ్ రిలేటివిటిలో ఒకేరకమైన ఆబ్సల్యూట్ టైం అనేది ఉండదు. కాని దీనికి బదులు ప్రతి వ్యక్తీ తన కాలాన్ని తానున్న ప్రదేశం, ప్రయాణించే విధానంతో గణన చేసుకొంటాడు.

**శాస్త్రిగారి భాష్యం–** ఈ విషయాలన్నీ మన వేదవేత్తలు ముందే తెలుసుకొని

దేవతలు సాపేక్షంగా అమరులు అని చెప్పారు. దేవతలకు అంతం ఉంది కాని వారు జీవితకాలం కల్పాలతో కలిసి ఉంటుంది. దీనికి కారణం వారు మర్త్య లోకానికి ఎంతో సుదూరంలో ఉండటమే. బహుశా ఈ దూరం మీడియం అంటే వాహిక, లేక ఫేజ్ మార్పు అయి ఉండచ్చు. ఇది ఒక కణం పదార్థాంగా మారటానికి పట్టే కాలం అని చెప్పవచ్చు. భూలోకంలోనే స్వర్గలోకం ఉంది అని వేదం చెప్పింది–"
అంతర్హితోహి స్వర్గ లోకో మనుష్య లోకాత్–
(యుజుర్వేదం 06వ కాండ 01వ అనువాకం)

కనుక స్వర్గలోకం మీడియంలో ఉన్నది మాత్రమే అని స్పష్టమైంది. ఇది దూరానికి (స్పేషియల్) సంబంధించింది కాదు. కారణం స్వర్గం మర్త్య లోకమైన భూమికి చెప్పలేనంత దూరంలో ఉండటమే. ఇది మీడియం డిఫరెన్స్ మాత్రమే. అందుకే దేవతల ఆయుర్దాయం మానవ ఆయుర్దాయం కంటే ఎక్కువ.

భూమిపై ఉన్న రాయి, ఒక కణం ఒక మూలకంగా (దేవతలు) మారటంతో పోల్చి ఈ వాహిక దూరాన్ని అర్థం చేసుకోవచ్చు. అంటే పదార్థ స్థితులలో వచ్చే మార్పు అన్నమాట. అంటే ఘన పదార్థానికి, వాయు పదార్థానికి ఉన్న భేదం లాంటిదన్నమాట. భారతీయ వేద విజ్ఞానం (మెటా ఫిజిక్స్) ప్రకారం పదార్థంలోని అతి సూక్ష్మ కణం పరమాణువు కాదు– తన్మాత్ర మాత్రమే. ఒక ప్రోటాన్ శిదిలం కావటానికి మిలియన్ల సంవత్సరాలు పడుతుంది. దీనినిబట్టి దేవతలు మానవులకంటే అత్యంత ఎక్కువ కాలం ఎందుకు జీవిస్తారో అర్థమవుతుంది. ఇదీ మర్త్యులకు దేవతలకు జీవితకాలంలో ఉన్న భేదం (బహుశా పరమాణువు).

**పేజీ 033, పేరా 03**

"విశ్వం మార్పు చెందదని, అది ఒకప్పుడు ఉండేది, అది ఎప్పటికీ ఉంటూనే ఉంది" అని నిశ్చయంగా భావించిన విషయంలో మార్పు వచ్చింది. చలనశీలంగా విస్తరిస్తున్న విశ్వం ఎప్పుడో పూర్వం ఒక స్థిరమైన కాలంలో ఆవిర్భవించి, భవిష్యత్తులో ఒకచోట ఆగిపోతుందనే భావన దీని స్థానంలో ఏర్పడింది. పరిభ్రమణ విషయం ముందు అధ్యాయాలలో వస్తుంది. కాలం గడిచాక, అదే నా భౌతిక శాస్త్ర సిద్ధాంత పరిశోధనకు ప్రారంభ విషయం అయింది అన్నాడు హాకింగ్. తానూ, రోజేర్ పెన్ రోజ్ కలిసి అయిన్ స్టీన్ సాధారణ సాపేక్ష సిద్ధాంత ప్రకారం విశ్వానికి మొదలు తుది ఉన్నాయని చూపాము.

**శాస్త్రీయ భాష్యం–** ఇదే విషయాన్ని వేద కాల మహర్షులు "కాస్మిక్ పంచాంగం"లో తెలియజెప్పారు. ప్రస్తుత యుగం మహా యుగాలలో శ్వేత వరాహ కల్పంలోని 28వది అయిన కలియుగంలో మొదటి పాదం. వేద ఖగోళం విశ్వానికి ఆరంభం, అంతం కూడా ఉన్నాయని చెప్పింది. ఏదో వాళ్ళు కవితాత్మకంగా చెప్పిన దాన్ని ఇప్పటి పరిశోధనలకు ముడి పెడుతున్నావు, అదేదో యాదృచ్ఛికం అని నన్ను మీరు అనవచ్చు. కాని ఇది మన మహర్షుల క్రాంత దర్శనానికి ఉదాహరణ అని వారి మేధో వికసనానికి పరాకాష్ట అని మర్చిపోరాదు. వారెప్పుడో మనోబలంతో అంతర్ దృష్టితో దర్శించి ప్రవచించిన దానినే ఎన్నో ఏళ్ళ తర్వాత సైన్స్ పరిశీలించి చెప్పింది. ఇది ముమ్మాటికీ నిజం.

ఇక్కడ ఒక విషయంలో జాగ్రత్త పడాలి మనం. వేదాంత విషయమైన అద్వైతానికి మర్త్య లోకానికి చెందిన సైన్స్‌కు ముడిపెట్ట రాదు. మన పూర్వీకులు ఈ రెండిటినీ వేర్వేరుగానే చూశారు. సూర్యోదయాన్ని విస్తృతంగా వర్ణించిన వేదం, ఉపనిషత్‌లో సూర్యుడు ఉదయించడు, అస్తమించడు అనీ చెప్పింది. భూమి మాత్రమే తిరుగుతుంది అని చెప్పింది. ఖగోళ పంచాంగం వగైరాలు మానవులకు మాత్రమేనని గ్రహించాలి. గ్రహ గతులను తెలుసుకోవటానికి మాత్రమే అని సహకరిస్తాయి. అంతేకాని ఈ ప్రపంచం మిధ్య అన్న అద్వైతానికి ఇది వర్తించదు. వేదాంత ఆలోచనలను నిత్య జీవిత విషయాలతో కలపరాదు. బ్రహ్మ సూత్ర భాష్యం శాస్త్రాలన్నీ భ్రాంతినాధారంగా రాయబడినవి అని చెప్పింది. అందుచేత అవి ప్రకృతితో అనుభవాధారమైనవి (ఎంపెరికల్) అని స్పష్టపరుస్తాయి. ఈ శాస్త్రాలు అంటే మన భాషలో సైన్స్‌లు మానవ కంటికి దేవుడిని చూపించలేవు. దీనికి కారణం చెప్పాలంటే ఇవన్నీ మానవ సిద్ధాంత రచనలే కావటం వలన.

## మూడవ అధ్యాయం– విశ్వ వ్యాపనం

**పేజీ 037, పేరా 01**

మనం ఒక గెలాక్సీలో ఉన్నాం. అది ఒక లక్ష కాంతి సంవత్సరాల దూరంలో ఉండి, నెమ్మదిగా పరిభ్రమిస్తోంది. చుట్టగా (స్పైరల్) బాహువులలోని నక్షత్రాలు కేంద్రం చుట్టూ అనేక వందల మిలియన్ల సంవత్సరాల కొక చుట్టూ తిరుగుతూ ఉంటాయి.

**శాస్త్రిగారి భాష్యం–** ఈ స్థిర నక్షత్రాన్నే మన పూర్వులు ధృవ నక్షత్రం అన్నారు.

దీని చుట్టూ పాలపుంతలోని మిగిలిన నక్షత్రాలు తిరుగుతాయని చెప్పారు. బాగా అర్థం కావటానికి సామాన్యుల కోసం ధృవుని కథగా చెప్పారు. ధృవుడు తపస్సు చేసి దీన్ని సాధించాడని అన్నారు. వివాహ మంత్రాలలో కూడా ఈ విషయం ఉంది. ధృవ నక్షత్రాన్ని నూతన దంపతుల మధ్య శాశ్వత శృంగార బాంధవ్యం దృఢంగా, స్థిరంగా ఉండేట్లు చేయమని అర్థిస్తారు. కాలాన్ని స్పైరల్‌గా భావించటంలో ఒక పరమార్థముంది. సూర్యుని సమీపంలోని సింశుమార చక్రం తిరుగుతూ ప్రతి 60 ఏళ్ళకు ఒకసారి ఉన్నచోటికి వస్తుంది. దీన్ని గమనించాలి. సంస్కృతంలో సింశుమార అంటే ఒక సముద్ర జీవి. చక్రానికి (స్పైరల్‌కు) 27 నక్షత్రాలు ఉంటాయి. వీటిని చంద్రుని భార్యలుగా భావిస్తారు. ఒక్కో నక్షత్రంలో చంద్రుడున్న నెలను ఆ నక్షత్రం పేరుతో పిలుస్తారని మన ఖగోళ శాస్త్రం చెప్పింది. మృగశిరా నక్షత్రంలో చంద్రుడు పూర్ణమినాడు ఉంటె ఆ నెలకు మార్గశిర మాసం అని పేరు. అలానే మిగిలినవి కూడా.

**పేజీ 44, పేరా 2**

"గురుత్వాకర్షణ యెంత బలీయమైనది అంటే స్పేస్ దానికదే ఒంగిపోయి భూమి ఉపరితలం లాగా కనిపిస్తుంది". బహుశా సాగర మధనం మహా కూర్మం పైన ఉన్న గుల్ల మీద మంధర పర్వతం ఆని ఉండటాన్ని సూచిస్తుంది.

**పేజీ 47, పేరా 02**

గెలాక్సీలు ఒకదాని కొకటి దూరం జరిగితే, నిరంతరం ఏర్పడే కొత్త పదార్థం నుండి కొత్త గేలాక్సీలు ఏర్పడి ఆ స్థానాలను భర్తీ చేస్తాయి. అందువలన అన్ని సమయాలలో, స్పేస్‌లోని అన్ని బిందువుల వద్దా విశ్వం మామూలుగానే మార్పు లేనట్లు కనిపిస్తుంది.

**శాస్త్రీజీ వివరణ–** ఈ స్థిరరూప సిద్ధాంతాన్నే బార్డి గోల్డ్– బాయిల్ సిద్ధాంతం అన్నారు. కాని కొంతకాలం తర్వాత ఈ సిద్ధాంతానికి "తూ నా బొడ్డు" అని తీసి పారేశారు. ఈ విషయాన్ని భారతీయ మహర్షులు, ద్రష్టలు గణాలకు నాయకుడైన గణపతికి ఉన్న సంబంధంతో చూపారు, రాశారు. ఇక్కడ గణాలు అంటే నక్షత్ర గణాలు అని అంటే గేలాక్సీలు అని అర్థం. ఆయనకు నైవేద్యంగా పెట్టేవి బియ్యపు నూకతో చేసిన ఉండ్రాళ్ళు. అవే ఆయనకు ఇష్టం. ఇవే నక్షత్రాలు. ఆయన

బొజ్జ ఈ విశ్వమే. పాత తారల స్థానంలో నిరంతరం కొత్త నక్షత్రాలు సృష్టింపబడటం అంటే నక్షత్రాలు వాటిలో ఉండే పదార్థం (మాస్) హరించుకొని పోవటమే. కొత్త తారల పుట్టుక గెలాక్సీలలోని అయస్కాంత క్షేత్రాన్ని సమతుత్యతలో ఉంచటానికే. ఈ గెలాక్సీలో ఉన్న ఒక్క నక్షత్రం ధ్వంసమైనా చాలు, గెలాక్సీ కుప్ప కూలిపోతుంది. అందుకే మన పూర్వీకులు గణేశ్వరుని ఈ నక్షత్ర సమూహ మూర్తిగా (ఎంబాడిమెంట్) చెప్పారు. మూర్తీభవించిన విశ్వంలోని నక్షత్ర కూట సముదాయమే వినాయకుడు అన్నమాట. అంటే ఆయన శరీరంలోని నక్షత్రాలున్నాయని భావం. కనుకనే వినాయక చవితికి ఆయన శిరస్సుపై "మహా రాజ లాంఛనం" అయిన ఛత్రంగా "పాలవెల్లి"ని 'వెదురు పుల్లల'తో తయారు చేసి రంగు కాగితాలతో అలంకరించి ఉంచుతారు. ఈ పాలవెల్లినే "మిల్కీ వే" అంటాం.

## నాలుగవ అధ్యాయం- అనిశ్చిత సూత్రం

**పేజీ 56, పేరా 02**

కాంతి తరంగ సముదాయమే అయినప్పటికీ మాక్స్ ప్లాంక్ ప్రతిపాదించిన క్వాంటం ప్రతిపాదన ననుసరించి కొన్ని సందర్భాలలో కాంతి కణ సముదాయంగా ప్రవర్తిస్తుంది. అది కొన్ని పాకెట్‌లుగా (క్వాంట్స్) వెలువడుతుంది, హరించుకు పోతుంది.

**వ్యాఖ్యానం-** ఈ అధ్యాయం పూర్తిగా సాంకేతికపరమైనది, కణాలుగా ద్వంద్వ ప్రవృత్తులను గూర్చి చెప్పటం (ఈ ప్రపంచాన్ని ఏర్పరచే ప్రాథమిక కణాలు ప్రోటాన్, న్యూట్రాన్‌లతో ఉంటాయి) అవి కణాలుగా, తరంగాలుగా ప్రవర్తిస్తాయనటం అంతా సాంకేతికమైన భావనలే. ఇందులో భారతీయ సాహిత్యం కణ సిద్ధాంతాన్ని బిందు సిద్ధాంతంగా చెప్పి కొంతవరకు ఆమోదించింది. కాంతి బిందు సమూహం ఆ సముదాయమే కాంతి పుంజం అని చెప్పింది. ఈ కాంతి పుంజమే తరంగమా? వేద భావనలో తరంగ సిద్ధాంతం కూడా ఉంది. ఇది కాంతి ధ్వనులకు మాత్రమే కాక, ప్రపంచంలోని కదిలే, మారే ప్రతి వస్తువుకు వర్తిస్తుంది అన్నది.

ఇదే ఛందస్ (రిథిం) సూత్రం. ప్రపంచ గమనాన్ని నియంత్రించేవి సప్త ఛందస్సులు. అవే గాయత్రి, త్రిష్టుప్, జగతి, ఉష్ణిక్, సక్వరి, అనుష్టుప్ బృహతీ మొదలైన ఛందస్సులు. సృష్టిలో ప్రతిదీ లయ బద్ధంగా (రిథమిక్) కదులుతుంది.

ప్రతిదీ ముందుకు తరంగాలుగా వర్తులంగా జరుగుతూ పోతుంది. ఉదాహరణకు కాలం సంవత్సరాల ఆవర్తనంతో ముందుకు కదులుతుంది. ప్రతి ఏడాది ఒక తరంగంగా భావిస్తే 60 సంవత్సరాల ఆవృత్తి ఒక సరళ రేఖగా ఒక తరంగ సముదాయం అవుతుంది. ప్రతి ఏడాదికి ఋతువులు అదే సమయంలో ఏర్పడటం జరుగుతుంది. కాని అవి ఒకే మాదిరిగా ఉండవు. కారణం అవి స్పేస్‌లో మరొక మెట్టు ముందుకు జరిగిపోవటమే. కనుక దీనిని బట్టి వేదం కణ సిద్ధాంతాన్నీ, తరంగ సిద్ధాంతాన్నీ రెండిటినీ సమర్థించింది అని తెలుసుకోవాలి. ఇది అనంతమైన టైం, స్పేస్‌ల సృష్టులకు (కల్పాలు)కు తుదిగా భావించిందన్నమాట.

**పేజీ 60**

ఇదివరకటి అధ్యాయంలో మనం చర్చించినట్లు తరంగ, కణ సిద్ధాంతాల నుపయోగించి విశ్వంలోని ప్రతి వస్తువు కాంతి, సాపేక్షతతో సహా అన్నిటినీ కణాల నాధారంగానే వివరించాలి.

ఈ అధ్యాయం క్వాంటం మెకానిక్స్, గ్రావిటీలను కలిపి సమగ్రపరచి ప్రవచించే సిద్ధాంతాల కోసం ఆశిస్తూ ముగింపు పలకటమైంది.

## అయిదవ అధ్యాయం– మూల కణాలు, ప్రకృతి శక్తులు

**పేజీ 64, పేరా 02**

ఈ ఎలక్ట్రాన్లు పరమాణువు లోపలి నుండే వెలువడుతున్నాయని వెంటనే గమనించడమైంది. 1911లో బ్రిటీష్ భౌతిక శాస్త్రవేత్త ఎర్నెస్ట్ రూధర్ ఫోర్డ్– పదార్థంలోని పరమాణువులో అంతర్నిర్మాణం ఉందని రుజువు చేశాడు.
శాస్త్రిగారి వ్యాఖ్య– దీనినే కణాదుని వైశేషిక దర్శనంలో “అణు” అని పిలిచాడు. అణువు విభజింప బడదు కాని పరమాణువు అనే పదాన్ని వాడి, విభజన జరుగుతుందని సూచించాడు. భారతీయ నాగరికతలో భాగమైన బౌద్ధ మతంలో శక్తి స్పేస్ (ఆకాశం)లో కనిపించని రూపంలో ఉంటుందని చెప్పింది. దీనికి ముందే భారతీయ బ్రహ్మ సూత్రాలలో సృష్టికర్త లేక బ్రహ్మం అంటే స్పేస్ అని చెప్పబడింది. దీనికి సంబంధించిన మంత్రం– “ఆకాశవత్ సర్వ గతాః నిత్యః” బ్రహ్మం లేక సృష్టికర్త ఆకాశంలాగా అనంతం, తుది లేనిది అని భావం. దీన్నిబట్టి

చూస్తే మన పూర్వీకులు పదార్థం యొక్క చివరి స్థితి ఆకాశమే అని, అన్ని పదార్థాలు శక్తి నుండే ఆవిర్భవిస్తాయని అది మానవ నేత్రానికి దృగ్గోచరం కాదని చెప్పారు. అతి వినయంగా ఒక విషయం చెబుతున్నాను– వేద సాహిత్యం ఈ పరమాణువు మొదలైనవన్నీ భౌతిక పరమైనవి (మెటీరియలిజం) కనుక దానిపై దృష్టి పెట్టలేదు.

**పేజీ 68, పేరా 02**

క్వాంటం మెకానిక్స్‌ను, స్పెషల్ దీరీ ఆఫ్ రిలేటివిటిలకు స్థిరమైన (కన్సిస్టంట్) రూపాన్ని ఇచ్చి సిద్ధాంతీకరించిన మొదటివాడు డిరాక్. ఎలక్ట్రాన్‌కు స్పిన్ 1/2 ఎందుకు ఉన్నదో, అది ఒక వలయం పూర్తిచేసే సరికి ఒకే మాదిరిగా ఎందుకు ఉండదో గణితం ఆధారంగా వివరించాడు. ఎలక్ట్రాన్‌కు ఒక భాగస్వామి అంటే యాంటి ఎలక్ట్రాన్ లేక పాజిట్రాన్ ఉండి ఉండాలని ఊహించాడు. 1932లో కనుగొనబడిన ఈ విషయాన్ని "డిరాక్ సిద్ధాంతం" అన్నారు. దీనికే ఆయనకు 1933లో నోబెల్ ప్రైజ్ వచ్చింది. దీనినిబట్టి ప్రతి కణానికి వ్యతిరేక కణం అనేది ఒకటి ఉంటుంది అని అర్థమయింది. ఈ యాంటి పార్టికల్ ఉండటం వలన అది అంతరించి పోగలదు. ఈ కణాలను మోసే శక్తులు, యాంటీ పార్టికల్స్‌కూ సమానమే. ఏతా వాతా తెలియ వచ్చేదేమిటంటే– వ్యతిరేక ప్రపంచాలు. వ్యతిరేక మనుషులు కూడా యాంటి పార్టికల్స్ వలన ఏర్పడుతాయని, నీ యాంటి వ్యక్తిని కలిస్తే పొరబాటున కూడా వాడికి షేక్ హాండ్ ఇవ్వద్దు. ఇస్తే ఇద్దరూ పెద్ద మిరుమిట్లు గొలిపే కాంతిలో అంతరించిపోతారు.

**శాస్త్రీజీ వ్యాఖ్యానం–** ఇదంతా వేదంలో చెప్పినట్లు దేవతలకు అసురులకు సంబంధించిన విషయంగా అనిపిస్తోంది కదూ. కణాలు దేవతలైతే వ్యతిరేక కణాలు యాంటి పార్టికల్స్ రాక్షసులు. దేవతలు యజ్ఞాలు చేస్తారు. "యజ్" అనే సంస్కృత ధాతువు నుండి యజ్ఞం అనే మాట వచ్చింది. దీని అర్థం "సంఘటీకరణం". అంటే అన్నిటినీ కలపటం. ఈ ప్రపంచం పంచభూతాల చేత సంఘటితమై ఏర్పడింది కనుక "ప్రపంచం" అంటారు. ప్రపంచం అనే మాటలో "పంచ" అనేది ముఖ్యమైనది. "ప్ర" అనేది ఉప సర్గ. కావాల్సిన భావాన్ని స్పష్ట పరచటానికి ఉప సర్గను ఉపయోగించారు. దేవ దానవుల అనాది కాల యుద్ధాల గురించి ఎన్నో కథలూ గాథలూ మన వేద సాహిత్యంలో ఉన్నాయి.

**పేజీ 69, పేరా 02**

కణాల వాహికలైన శక్తులు పదార్థ కణాలతో పరస్పర మార్పు పొంది ప్రభావం ఉన్నా రూపంలేని (వర్చువల్), యదార్థ కణాలు అనిపించని వాటిగా ఉంటాయి. వీటిని సూటిగా పార్టికల్ డిటెక్టర్‌తో కూడా గుర్తించలేము. అవి ఉన్నాయని వాటి ప్రభావం వలన మనకు తెలుసు కాని చూడలేం. ఇవి పదార్థ కణాల మధ్య శక్తి జనకాలౌతాయి. కణాలలో స్పిన్ 0, 1 లేక 2 కూడా ఉన్నాయి. ఇవి కొన్ని సందర్భాలలో నిజమైన కణాలలాగా ఉంటాయి. అప్పుడు వీటిని మనం కనిపెట్టి చూడగలం. అప్పుడు అవి ఒక భౌతిక శాస్త్రవేత్త (క్లాసికల్ ఫిజిస్ట్) చెప్పే కాంతి లేక గ్రావి టేషనల్ తరంగాలుగా మనకు దర్శనమిస్తాయి. పదార్థ కణాలు ఒకదానితో ఒకటి సంఘర్షణ చెందినప్పుడు ఆభాస కణ వాహికలు ఒకదానితో నొకటి మార్పు చెందినప్పుడు ఇది ఉద్గారం చెందుతాయికూడా. రెండు ఎలక్ట్రాన్ల మధ్య వికర్షణ బలం ఏర్పడటానికి కారణం ఎప్పటికీ మనకు గోచరించని కనిపెట్టబడని ఆభాస ఫోటాన్‌ల మధ్య మార్పు మాత్రమే. ఒకవేళ ఒక ఎలక్ట్రాన్ రెండవ దానికంటే వేగంగా ప్రయాణిస్తే వాస్తవ ఫోటాన్లు మార్పు చెంది కాంతి తరంగాలుగా కనిపిస్తాయి.

**శాస్త్రి గారి వ్యాఖ్యానం–** స్టీఫెన్ హాకింగ్ వంటి మేధావి సైంటిస్ట్‌లు ఇప్పుడున్న స్థితిలో ప్రపంచంలోని ఇంకా కొన్ని కణాలను సైన్సు డిటెక్టర్ ద్వారా గుర్తించి చూడలేక పోతుందని, కాని సిద్ధాంత రీత్యా అవి ఉన్నాయని తెలుస్తోందని తెలియజెప్పారు. ఈ వర్చువల్ కణాలు పదార్థ నిర్మాణంలో కీలక పాత్ర పోషిస్తున్నాయి. కనుక మనం వీటిని దేవతలతో పోల్చుకోవచ్చు. ఒక మంత్రం "పరోక్ష ప్రియా ఇవహి దేవః" అనేది ఉంది. దీని అర్థం దేవతలు మానవ దృష్టికి గోచరం కాకుండా రహస్యంగా (పరోక్షంగా) ఉంటారు. అందుకే వేదాలు పితృ కర్మల విషయంలో శ్రాద్ధ కర్మలు చేయమని చెప్పింది. పితృదేవతలు మానవ కంటికి కనిపించరని, తర్క ప్రకారం వారు ఉన్నట్లు (లాజికల్)గా చెప్పగలమనీ దీన్ని తిరస్కరించలేమని తెలియజేసాయి. కనుక నాస్తికులు, హేతువాదులు ఇప్పటికైనా ప్రపంచంలో ఉన్న ప్రతిదానినీ ఈ కళ్ళతో చూడలేము అని గ్రహించాలి. వీళ్ళు దేవుడిని తమ కళ్ళ ఎదురుగా తీసుకొచ్చి చూపించి నమ్మించమంటారు అని ఒక చెణుకు చెణికారు శాస్త్రీజీ.

**పేజీ 69, పేరా 02**

"చివరగా భౌతిక శాస్త్రవేత్తలలో ఎక్కువ మంది ఒక ఏకీకృత సూత్రం ఏర్పడుతుందని ఆశగా ఎదురు చూస్తున్నారు. ఆ సూత్రం ఆ నాలుగు సూత్రాలు ఒకే శక్తిగా ఉన్న నాలుగు విభిన్న అంశాలుగా వివరించవచ్చని అనుకొన్నారు. ఇదే ఈనాటి భౌతిక శాస్త్ర లక్ష్యంగా కనిపిస్తోంది. ఇటీవల మూడు రకాల శక్తుల ఏకీకరణ విజయవంతమైంది. ఈ విషయాన్ని ఈ అధ్యాయంలోనే వివరిస్తాను. మిగిలిన దాని విషయమై తర్వాత ఆలోచిద్దాం" అన్నాడు సైంటిస్ట్ స్టీఫెన్ హాక్.

**వివరణ–** వేదం ఈ సూత్రాలను ఎప్పుడో ఏకీకృతం చేసింది. ఇవే గురుత్వాకర్షణ, విద్యుదయస్కాంత శక్తి, బలహీన న్యూక్లియర్ శక్తి, శక్తివంతమైన న్యూక్లియర్ శక్తి. వీటిని దైవీ శక్తులుగా పేర్కొన్నది అందుకే. ప్రతి శక్తినీ దేవతా స్వరూపంగా భావించి చెప్పింది. ప్రతి వస్తువు లేక దైవశక్తిని వీటిని కలిగి ఉన్నట్లు చెప్పి, ఆహ్వానించి పూజించేట్లు చేసింది. ఈ సంయుక్త శక్తిని ఆది దేవతగా చెప్పింది. ఉదాహరణకు రవి, చంద్ర, భూమి మొదలైనవి. ఇందులో ప్రతిదీ ఒక దేవతయే. కారణం ఈ దేవత నాలుగు శక్తులను ఏకీకృతం చేసి తనలో ఉంచుకొని, వాటితో విభిన్న కార్యాలను చేయిస్తుంది. గ్రావిటి, విద్యుదయస్కాంతం, పదార్థాన్ని బంధించి ఉంచే న్యూక్లియర్ ఫోర్స్, రేడియో యాక్టివిటి అనేవి ఇవే. వీటినే తర్వాత శక్తికి ప్రతీకగా ఒకోసారి పరస్పర ఖండన, వ్యతరేకతలున్నా భావించారు. ఒక ఋగ్వేద సూక్తం "ఇంద్రం మిత్రం వరుణం అగ్ని మాహుహు ఔతో దివ్యహ– సుపర్ణో గరుత్మాన్ ఏకం– సత్ విప్రా బహుధా వదంతి అగ్నిం– యమాన్ మాత రిశ్వాన మాహుహు"

ఈ సత్యాన్ని ఇంద్ర, మిత్ర, వరుణ, అగ్ని, సుపర్ణ, యమ, మాత రిశ్వ అంటే వాయువుగా పిలుస్తారు. కాని సత్యం ఒకటే. వివిధ నామాలతో పిలువబడుతోంది. ఈ ఏకీకృత శక్తినే వేదం "సత్" అన్నది. అందుకే వేదం "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" అంటే సృష్టికర్త ఒక్కడే. రెండవదైన వేరొక శక్తి అంటూ ఏదీ లేదు అని అర్థం.

**పేజీ 70, పేరా 01**

సూర్యునికి భూమికి మధ్య ఉన్న ఆకర్షణ శక్తి– ఈ రెండు పదార్థాల మధ్య గురుత్వాకర్షణ పరస్పర మార్పు వలన ఏర్పడేదిగా పరిగణింప బడుతుంది.

ఈ మార్పు చెందిన కణాలు వర్చువల్ పార్టికల్స్ అవి తప్పని సరిగా గణింప దగిన ప్రభావాన్ని కలిగిస్తాయి. ఇవే భూమిని సూర్యుని చుట్టూ తిరిగేట్లు చేస్తాయి. వాస్తవ గురుత్వాకర్షణలు క్లాసికల్ ఫిజిసిస్ట్‌ల దృష్టిలో గురుత్వాకర్షణ తరంగాలు. ఇవి బలహీనంగా ఉండి, కనిపించనంత, లేక గుర్తింపబడనంతగా ఇంతవరకు గమనింప బడనివిగా ఉన్నాయి.

**శాస్త్రి గారి కామెంట్–** కనుక చివరికి సైన్సు వర్చువల్ పార్టికల్స్ ఉన్నాయనే నిర్ణయానికి వచ్చింది. గెలాక్సీల కదలికలు ఈ కణాల పరస్పర మార్పు వలన జరుగుతాయని నిర్ణయానికొచ్చారు. దీనివలన దేవతలు అంటే శక్తులు కంటికి కనిపించవని తేలింది. ఇది భౌతిక వాదుల పిడి వాదానికి సరైన సమాధానం. చూడబడని వాటిని ఎవరు చూడగలరు? ఇవి అనుభవైక వేద్యాలే. దీనికి సమాధానంగా యజుర్వేద మంత్రం ఉండనే ఉంది. యజుర్వేదంలో ఒకటవ అనువాకంలో ఆరవ కాండలో యజ్ఞం చేసే యజమాని ఒక దీక్ష తీసుకోవాలని, దీక్షా వస్త్రంగా అతి స్వచ్ఛమైన తెల్లనివి ధరించాలని, ధరించే ముందు ఆ వస్త్రానికి వేద మంత్రాలతో నమస్కరించాలని ఉంది–

"సోమస్య తనురసి, తనువం మే పాహి– నక్షత్రాణాం అతీక సాత్ పాహి"– దీని అర్థం– ఓ స్వచ్ఛ వస్త్రమా! నువ్వే సోమ అనగా చంద్ర రూపానివి. నా శరీరాన్ని రక్షించు. నన్ను నక్షత్రాల మహా కాంతి శత్రువు నుండి కాపాడు.

అంతరిక్ష పదార్థాల అదృశ్య శక్తుల ఆకర్షణ బలాలను వేదం ఎప్పుడో గుర్తించి చెప్పింది. భౌతిక వాదులు వేదాలను నమ్మకపోతే సైన్సును నమ్మినా ఇదే అభిప్రాయానికి రావటం ఖాయం.

**పేజీ 75, పేరా 03**

యాదృచ్ఛిక (స్పాంటేనియస్) ప్రోటాన్ శిథిలతను ఇంతవరకు ఎవరూ ప్రయోగాలలో పరిశీలించకపోయినా, ప్రోటాన్ జీవిత కాలాన్ని ఉజ్జాయింపుగా పది మిలియన్ మిలియన్ మిలియన్ మిలియన్ మిలియన్ సంవత్సరాలుగా ఊహించారు. అంటే ఒకటి తర్వాత 31 సున్నాలన్న మాట. ఇది సరళ ఏకీకృత సిద్ధాంతం చెప్పిన కాలం కంటే ఎక్కువ. ఇంకా ఎన్నో పరిశోధనలలో ఈ కాలం పెరిగిందేకాని తగ్గలేదు. ఇంకా సున్నితమైన ప్రయోగాలు మహా పదార్థాలున్న వాటిపై జరిపి నిగ్గు తేల్చారు.

**శాస్త్రి గారి వ్యాఖ్య–** ప్రధానంగా పంచ భూతాత్మక దేవతలు, సాపేక్షంగా అమర్త్యులు.

హాకింగ్ చెప్పిన కాలం అంటే ఒకటి తర్వాత 31 సున్నాలున్న సంవత్సరాలు దేవతల జీవిత కాలం. అందుకే వేదం దేవతల జీవిత కాలం కల్పాలతో అంతమౌతుంది అని చెప్పింది. కనుక వారిని "త్రిదశులు" అన్నది అంటే– వారెప్పుడూ 30 ఏళ్ళ వయసున్న వారుగానే బలీయంగా కనిపిస్తారు. కారణం, ప్రళయం దాకా పంచ మూలకాలు మొదట్లో యెంత శక్తివంతంగా బలంగా ఉంటాయో చివర్లోనూ అలాగే ఉండటం. ప్రోటాన్ శిధిలం కావటానికి పట్టే కాలాన్ని దీనితో పోల్చవచ్చు. ఇదే అనంతకాలంలో తుది సమయం. ప్రోటాన్ శిధిలం అవటం అనే సంఘటన అని అర్థం చేసుకోవాలి.

**పేజీ 78, పేరా 3**

పదార్థ కణాలు, గురుత్వాకర్షణ బలాలు మిగిలిన వాటిపై పెత్తనం చేస్తాయి. అందుకే గురుత్వాకర్షణ విశ్వ పరిణామాన్ని నిర్ణయించేదిగా ఉంది.

**శాస్త్రీజీ భాష్యం–** ఇదంతా విష్ణుమూర్తి దశావతారాలలో ఒకటైన వరాహావతారాన్ని గుర్తుకు తెస్తుంది. వేద ఖగోళంలో ద్వాదశ రాశులలో ఒకటి అయిన కన్యా రాశిలో జరిగింది వరాహవాతారం. ఇదే ఆధునికులు చెప్పే వరాహ నక్షత్ర కూటమి (బోర్ కాన్సిలేషన్). విష్ణువు ఆది వరాహ రూపంలో హిరణ్యాక్ష రాక్షసుడిని వధించటానికి ముందు, భూమికి ఆకారమే లేదు. ఈ మహా కూటమి గురుత్వాకర్షణ బలం వలన భూమికి గోళాకార ఆకృతి ఏర్పడింది. వరాహవతార విగ్రహాన్ని చూస్తే వరాహం కోరపై వర్తులాకార విశ్వం కనిపిస్తుంది. దీనివలన అంతకుముందు భూమికి ఆకారం లేదని, అందుకే పరిణామం జరగటం ఆలస్యమైందని సూచిస్తోంది. అప్పుడు దేవుడు లేక సృష్టికర్త భూమి రూపం దాల్చాలని, అప్పుడే దానిపై జీవావిర్భావం జరగాలని నిర్ణయించాడు. అందుకే ఆయన ఈ కూటమిని సృష్టించి అయస్కాంత క్షేత్రం ఏర్పడేట్లు చేశాడు. హిందువులకు శ్వేత వరాహ కల్పంను గుర్తించగలరు. దీని అర్థం తెల్ల వరాహం నుండి ప్రారంభమైన సృష్టి అని భావం.



## ఆరవ అధ్యాయం– కృష్ణ బిలాలు (బ్లాక్ హోల్స్)

**పేజీ 082, పేరా 3**

చాలా విపరీతంగా ఉన్న వాయువు, ముఖ్యంగా హైడ్రోజన్ వలన నక్షత్రం ఏర్పడుతుంది. నక్షత్రం దాని భారానికి అదే గురుత్వాకర్షణ వలన కూలిపోతుంది.
**శాస్త్రిగారి కామెంట్–** హైడ్రోజన్ అంటే నీటిని ఏర్పరిచే ఒక మూలకం. వేదవిజ్ఞానం ఉన్న వారందరికీ ప్రపంచం నీటితో ఏర్పడిందన్న విషయం తెలుసు. వేదమంత్రాలలో ఈ విషయం చాలాసార్లు చెప్పబడింది. "అపోవా ఇదగం సర్వం, సర్వా భూతా న్యాపహః" భావం– విశ్వం అంతా నీరే. ప్రాణులన్నీ నీరే. ప్రపంచంలోని లయ లన్నీ జలమే. ప్రపంచంలోని కాంతి అంతా నీరే. ప్రపంచంలోని ప్రతిదీ నీరే. అందుకే సృష్టి నీటితో ఉన్న నక్షత్రాల నుండే నక్షత్రాల నుండే ప్రారంభమైంది. విశ్వం అంతా తారా సముదాయమే అంటే నీటి సముదాయమే. మహావిష్ణువు అన్నిటా పరివ్యాప్తమై ఉంటాడు కనుక, అన్నీ తానే కనుక, విశ్వం తానే అయి ఉన్నాడు.
కనుక "నారాయణుడు" అయ్యాడు. సంస్కృతంలో నారా అంటే నీరు అని అర్థం. అయన అంటే సన్నిధి. ఇదే విషయాన్ని మిగిలినవారు, గణేశాది దేవతలందరికీ వర్తిస్తుంది. వేద, పురాణాలలో నీటిని, దాని ప్రాముఖ్యాన్ని గూర్చి ఎన్నో ఆసక్తికర కథలున్నాయి. ఋగ్వేదంలో వరుణ దేవత అంటే కోరికలు తీర్చేవాడు అని ఉంది. అన్నిటినీ తీర్చేది, ఇచ్చేది నీరు అనే విషయం మనకు తెలిసిందే. చెట్లు, జంతువులూ, మానవులు పెరగటానికి నీరే ముఖ్య పదార్థం అనే ఈ మహా విజ్ఞానాన్ని దార్శనికులైన మన మహర్షులు ఎప్పుడో మనకు అందజేసినందుకు మనం ఏమిచ్చి వారి ఋణం తీర్చుకోగలం? సర్వదా వినయంతో కృతజ్ఞతతో ఉండటం తప్ప.

**పేజీ 87, పేరా 02**

ఒక నక్షత్రం కూలిపోయి బ్లాక్ హోల్‌గా మారటం చూస్తే, రిలేటివిటి థీరీ ప్రకారం ఆబ్సల్యూట్ టైం అనేది లేదని తెలుస్తోంది. అయితే ప్రతి పరిశోధకుడికి అతనికి సంబంధించిన కాలం ఉంటుంది.
**శాస్త్రిగారి వివరణ–** పూర్వపు భారతీయ తార్కికులు దీన్ని ఎప్పుడో గుర్తించారు.

వాళ్ళు కాలాన్ని "విభు" అన్నారు. అది నేచర్ సూత్రాలకు బద్ధం కాదు. కారణం అదే ప్రకృతిని సృష్టిస్తుంది కనుక. కనుక ఆబ్సల్యూట్ టైం అనేది ఉండదు. మనం చేయాల్సింది ఏమిటంటే ఒక ఏక పక్ష (ఆర్బిట్రరి) బిందువు నుండి సాపేక్షంగా మాత్రమే గణించగలం. అందుకే ఇండియాలో మనకు నాలుగైదు రకాల పంచాంగాలున్నాయి. ఇందులో ఒకటి చంద్ర గమనం పైనా (చాంద్రమానం), మరొకటి సూర్య గమనం ఆధారంగా (సూర్యమానం) మరొకటి గురు సంచారం ఆధారంగా (బార్హస్పత్య మానం) పంచాంగాలున్నాయి. యజ్ఞ యాగాదులకు చాంద్రమానాన్నే పరిగణనలోకి తీసుకొని మహూర్త నిర్ణయం చేస్తారు. వేదంలో చంద్రుని ప్రాముఖ్యత ఏమిటో మనకు తెలుస్తుంది. భూమిపై సృష్టి చంద్రుని నుంచి అంటే చంద్రోదయం నుండి ప్రారంభమైనదని వేదం గుర్తించింది. భూమిపైన ఏర్పడిన నీరు చంద్రుడు కనపడిన తర్వాత ఏర్పడింది. అందుకే కృష్ణపక్షంలో అమావాస్య, శుక్లపక్షంలో పౌర్ణమి ఈ రెండూ వేద కర్మలకు ముఖ్యమైనవి.

**పేజీ 89, పేరా 03**

తప్పించుకోవటానికి అసాధ్యమైన దిక్చక్ర సంఘటన (ఈవెంట్ హోరైజన్), స్పేస్ టైం సరిహద్దు ఒక రకంగా బ్లాక్ హోల్ చుట్టూ పొరలా వ్యాపించి ఉంటుంది. అజాగ్రత్తగా ఉంటే అంతరిక్ష యాత్రికుడు బ్లాక్‌హోల్‌లోని ఈవెంట్ హోరైజన్‌లోకి పడిపోయి, మళ్ళీ బయటికి రాలేడు.

**శాస్త్రిగారి వ్యాఖ్య–** ఇక్కడ ఒక ముఖ్య విషయాన్ని చెప్పాలి. అదే గణేశ విషయం. మానవలోకంలో ప్రకృతి సూత్రాలకు లొంగని చాలా బలమైన శత్రుబలం ఉన్నదని, ఈవెంట్ హోరైజన్ అనేది మన వాళ్ళు అన్యర్థం (ఎలిగరి)గా చెప్పారని అనిపిస్తోంది. వినాయక చవితినాడు ఈ కథను చదివి చెప్పుకొంటాం. దీన్ని మరికొంచెం వివరంగా తరచి చూద్దాం–

గజాసురుడు అనే రాక్షసుడు ఉండేవాడు. తపస్సు చేశాడు. తపస్సులో ఉష్ణం ఉత్పత్తి అవుతుంది. ఇదే ఇంద్రియాలను జయించటం. నిరాహారంగా ఎన్నో ఏళ్ళు తపస్సు చేసి మనసును సృష్టికర్తపై లగ్నం చేసి శివుడిని మెప్పించి సాక్షాత్కారం పొందాడు. వరం కోరుకోమనగా తన కడుపులో శివుడు ఉండిపోయే వరం కోరాడు. టైం స్పేస్ సరిహద్దు ఒకరకంగా పొర. అందుకే విశ్వంలో బయట ప్రపంచానికి శివుడు కనిపించలేదు. ఇదివరకే చెప్పినట్లు వేద విజ్ఞానం అయస్కాంత బలాన్ని గజబలంతో పోల్చింది. అదొక ప్రతీకాత్మక విషయం. దీనికి కారణం

ఏనుగు తన బలీయమైన తొండంతో అన్ని శక్తులను పరాస్తం చేసి విజయం సాధిస్తుంది. ఇదే పదార్థాలను ఆకర్షించే అయస్కాంత శక్తి. మహాశివుడే నక్షత్రాలు గేలాక్సీలు, గ్రహాలూ ఉన్న విశ్వం. శివుడు గజాసురుడికి ఇచ్చిన వరం ప్రకారం గజాసుర గర్భస్తమయ్యాడు. అంటే సకల విశ్వం గజాసురుని గర్భంలో ఉండిపోయింది. ఏనుగు ఒకే ఒక రంగు ఉంటుంది. అది నల్లగా ఉండి, అయస్కాంత క్షేత్రంగా ఉంటుంది.

**పేజీ 092, పేరా 03**

నిజానికి ఇదే బ్లాక్‌హోల్‌ను వ్యతిరేకించే వారికి తెలియజెప్పే ముఖ్యమైన వాదం. మోసపూరిత రిలేటివిటి దీరీ గణనాల సాక్ష్యాదారం మీద మాత్రమే వస్తువులపై నమ్మకం ఎలా కలిగి ఉంటాం? 1963లో మార్కర్ స్కిమ్మట్ అనే వ్యోమగామి కాలిఫోర్నియాలోని పోలిమార్ అబ్సర్వేటరి నుండి రెడ్ షిఫ్ట్‌ను 3 సి 273 అనే సోర్స్ నంబర్ 273 అనే కేంబ్రిడ్జి రేడియో సోర్స్ కేటలాగ్ ఆధారంగా కొలిచాడు. గ్రావి టేషనల్ ఫీల్డ్ దేవుని మనసులో చాలా విస్తృతమైనదని, అది ఒక గ్రావి టేషనల్ రెడ్ షిఫ్ట్ అయి ఉంటే, ఆ వస్తువు చాలా విపరీతమైన పెద్దది అయి ఉండాలని, మనకు దగ్గరగా ఉండి ఉండాలని, అది సౌర వ్యవస్థ (సోలార్ సిస్టం) గ్రహ గతులను కల్లోల పరుస్తుందని గ్రహించాడు. విశ్వం వ్యాప్తి చెందినపుడు ఈ రెడ్ ఫిష్ట్ బదిలీ అయి, ఆ వస్తువు అత్యంత దూరంలో ఉన్నట్లు భావించాలని తేల్చాడు.

**శాస్త్రి గారి వ్యాఖ్య-** పై విషయాల వలన సైంటిస్ట్‌లు రుజువులు అడగకుండా, ఇంద్రియాలు చేత చూడబడలేదని కొన్ని సిద్ధాంతాలను, ఊహలను నమ్మారని తెలుస్తోంది. దీనివలన ప్రయోగం కంటే తర్కానికే ప్రాధాన్యత ఉందని తెలియజేయ బడింది. సైంటిస్ట్‌లు మత విశ్వాసాలకు సాక్షాలు చూపాలనటం నిజాయితీ తనం కాదు. దేవతలు, పితృదేవతలను కళ్ళ ఎదుట చూపమనటం మూర్ఖత్వం. పితృ దేవతలున్నారనటం తార్కిక నిర్ణయం. ఇది పునర్జన్మ సిద్ధాంతంపై ఆధారపడింది. చంద్రుడు, ఋతువులు, సూర్యుడు, దేవతలు ఉన్నారు అని చెప్పటానికి తిరుగులేని సాక్ష్యం.

**పేజీ 094, పేరా 01**

వ్యోమగాములు అనేక వ్యవస్థలను పరిశీలించారు. అందులో రెండు నక్షత్రాలు పరస్పర భ్రమణాలను చూసి అవి ఒక దానినొకటి పరస్పరం ఆకర్షించుకొంటున్నట్లు తెలుసుకొన్నారు. కంటికి కనిపించే ఒకే ఒక తార కనిపించని తోటి తార చుట్టూ తిరిగే ఉన్న వ్యవస్థలనూ చూశారు.

**శాస్త్రీజీ భాష్యం–** మన సూర్యుడు తన గ్రహాలూ, మిలియన్ల కొద్దీ నక్షత్రాలతో ఒక గెలాక్సీలో ఉందని మనకు తెలుసు. వేదవేత్తలు నెలకు 30 రోజులున్నా, రెండు పక్షాలుగా నెల ఉన్నా, సూర్యుడు 27 నక్షత్రాలపైననే ప్రభావం కలిగి ఉంటాడని తెలుసుకొన్నారు. ఈ నక్షత్ర సముదాయాన్ని సింసు మార చక్రం అన్నారు. సింసు మార అనేది సముద్ర జల జీవి అని ఇదివరకే చెప్పుకొన్నాం. ఈ 27 తారలను 12 రాశులకు పంచారు. ఖగోళ శాస్త్రం ఈ రాశులు భూమి చుట్టూ ప్రతిరోజూ తిరుగుతూ రెండు గంటలకొక రాశిలో ఉంటాయి అన్నది... ఇది ఖగోళ గణితానికి మాత్రమే వర్తిస్తుంది. ఇవే నవ జాత శిశువు జన్మ నక్షత్రం తెలుసుకోవటానికి ఉపయోగిస్తుంది. హేతువాదులు, సైంటిస్ట్‌లు ఇప్పటికీ జ్యోతిషాన్ని ఒక శాస్త్రంగా గుర్తించక పోవటం వారి ఉష్ట్ర పక్షి విధానానికి గొప్ప ఉదాహరణ.

**పేజీ 095, పేరా 01**

బ్లాక్ హోల్స్ సంఖ్య చాలా ఎక్కువే. ఇప్పటికే ఎన్ని తారలు తమలోని న్యూక్లియర్ ఇంధనం అయిపోయి కూలిపోయి ఉండవచ్చు. కనిపించే నక్షత్రాల సంఖ్య కంటే బ్లాక్‌హోల్స్ సంఖ్య చాలా ఎక్కువ. మన గెలాక్సీలోనే లక్ష మిలియన్‌ల నక్షత్రాలున్నాయి. ఆ బ్లాక్ హోల్స్‌కున్న అధిక గ్రావి టేషనల్ ఆకర్షణ మన గెలాక్సీ ఇప్పుడున్న వేగంతో, ఎలా తిరుగుతుందో వివరిస్తుంది. కనిపించే నక్షత్ర ద్రవ్యరాశి దీన్ని గణించటానికి సమర్థమైనది కాదు. సూర్యుని కంటే అధిక ద్రవ్యరాశి అంటే లక్ష రెట్ల ద్రవ్యరాశి ఉన్న కృష్ణబిలం మన గెలాక్సీ కేంద్రంలో ఉండి ఉండాలి. ఈ గెలాక్సీలోని తారలు బ్లాక్ హోల్‌కు దగ్గరకొచ్చి, వాటి దగ్గర, ప్రక్కల ఉన్న గురుత్వ బలాలలోని తేడాల వలన ముక్కలు చెక్కలై నలిగిపోతాయి.

శాస్త్రిగారి వ్యాఖ్యానం– వేద విజ్ఞానుల సిద్ధాంతాలను ఇంత ఖచ్చితంగా గుర్తించి చెప్పిన స్టీఫెన్ హాకింగ్ శాస్త్రవేత్తను చూసైనా శాస్త్రవేత్తలు దారికి రావాలి. వేద భావనలైన భావనలైన దేవా సుర భావాలను గ్రహించాలి. కనిపించే నక్షత్రం

యొక్క స్పైరల్ గమనంకు కారణం బ్లాక్ హోల్స్. అసురులు అంటే మనం బ్లాక్ హోల్స్‌గా భావించాలి. దేవతలు అంటే కనిపించే నక్షత్రాలు . సాగర మథన వృత్తాంతంలో దేవ దానవులు క్షీర సాగారాన్ని మథించటం తెలుసుకొన్నాం. ఇవే బ్లాక్ హోల్స్, కనిపించే నక్షత్రాలు అయిన రాక్షసులు దేవతలు బ్లాక్ హోల్స్‌కు దగ్గరకొచ్చే నక్షత్రాలు ముక్కలై రూపు చెడి నశిస్తాయి. ఇవి మహా రాక్షసులైన హిరణ్య కశిప, రావణాదులను గుర్తుకు తెస్తాయి. ఈ కథ అన్ని యుగాలలోనూ జరిగేదే. ఇన్ని శాస్త్రీయ విషయాలను మన వేదం మన దివ్య ఋషులు ముందే చెప్పి మనల్ని జాగృతం చేసిన తర్వాత ఇవాళ సైంటిస్ట్‌లు వేదంపై నమ్మకాన్ని పెంచుకొన్నారు. అన్నదమ్ములైన దేవ రాక్షసుల మధ్య శాశ్వత యుద్ధాన్ని వేదం చెప్పింది. ఇద్దరూ కశ్యప మహర్షి సంతానమే. దితి, అదితిల కుమారులే అన్నదమ్ములే. రాక్షసులే. ముందుగా దితికి జన్మించారు. అందుకే వారిని దైతేయులన్నారు. లేక దైత్యులన్నారు. హాకింగ్ శాస్త్రవేత్త గెలాక్సీల స్పైరల్ కదలిక ఎంతోకాలం క్రితం బ్లాక్ హోల్స్ అయిన తారల వలన జరిగినదే అన్నాడు. ఇదే మనవాళ్ళు చెప్పింది కూడా. అదే నిజమైంది కూడా.

## ఏడవ అధ్యాయం– కృష్ణబిలాలు మరీ అంత నల్లనివి కావు

**పేజీ– 105; పేరా–02**

మనం అనుకొనే ఖాళీ జాగా (ఎంప్టి స్పేస్) పూర్తిగా ఖాళీది కానక్కర్లేదు. అలా ఉంటే గురుత్వాకర్షణ, విద్యుదయస్కాంత క్షేత్రాలు మొదలైనవన్నీ శూన్యం అయిపోవాలి.

**పేజీ– 106; పేరా– 02**

శూన్యం నుండి శక్తిని ఉత్పత్తి చేయలేము. కణంలో మరో వ్యతిరేక కణం (యాంటి పార్టికల్) ఉంటుందని తెలుసు. మొదటి దానిపై ధనాత్మక శక్తి, రెండవ దానిపై ఋణాత్మక శక్తి ఉంటాయి.

**శాస్త్రీజీ వ్యాఖ్యానం–** ఈ అత్యంత ఉత్కృష్ట సాంకేతిక చర్చలు రేడియోషన్ ఉద్గారానికి దారి తీసింది. ఖాళీగా కనిపించేది నిజమైన ఖాళీ ప్రదేశం కాదు.

అది కంటికి కనిపించని రుణ లేక ధనాత్మక శక్తి మాత్రమే. ప్రతి అవతార పురుషుడు, లేక మహా సన్యాసి సమాధి అవటం. వారు మహాశక్తిలో సంలీనం కావటం మనకు తెలుసు. జగద్గురువు శ్రీ ఆదిశంకరాచార్య చివరకు శక్తి స్వరూపమైన పరమేశ్వరి సాన్నిధ్యం చేరారని మనకు తెలిసిన సంగతే. కారణం ఏ ద్రవ్య రాశి కూడా శక్తి లేక ప్రభవించదు. ద్రవ్య రాశి శక్తి పరస్పర వినిమయం అవుతాయి అనటానికి ఉదాహరణ. ద్రవ్య రాశి సృష్టి అంటే దేవుని కార్యమైన సృష్టి మాత్రమే. దీనికి సృష్టికర్తకైనా శక్తి అవసరమే. శంకరుల శివానంద, సౌందర్య లహరిలలో ఈ శక్తిని "చిచ్ఛక్తి" అన్నారు. అంటే స్పేస్ మరియు శక్తి అంటే జ్ఞానం శక్తి అని భావం. జగద్గురువులు యెంత దాకా వెళ్ళారంటే- శివుడు శక్తి సహకారం లేకుండా ఒక్కడుగు కూడా ముందుకు వేయలేడు. "శివ శక్త్యే యది భవతి". శక్తి అనేది ద్వంద్వా తీతమైనది. అంటే ద్వంద్వానికి ఆవలిది. భౌతిక పరిభాషలో ధన, రుణ శక్తులకు అతీతమైనది. ఇవి తెలివైన వారికే కాక సామాన్యులకు కూడా అర్థమయే విశేషాలే.

**పేజీ- 107; పేరా 2**

బ్లాక్ హోల్ అతి చిన్నదైనప్పుడు, (ఇది ఇంకా పూర్తిగా తెలియని విషయమే) అనుభవమైన ఊహ ప్రకారం మిలియన్ల సంఖ్యాలో ఉన్న హైడ్రోజెన్ బాంబుల విస్ఫోటనంతో సమానమైన ఒక బ్రహ్మాండమైన అంతిమ ప్రేలుడులో అది పూర్తిగా అదృశ్యమైపోతుంది.

శాస్త్రిగారి వ్యాఖ్యానం- దీనినే మనం పరంపరా గతంగా వస్తున్న "భస్మాసుర కథ"తో పోల్చవచ్చు. విష్ణుమూర్తి మోహిని అవతారం దాల్చి భస్మాసురుడిని మోహించినట్లు నటించి వాడి చేతులతోనే వాడి నెత్తిమీద చేతులు పెట్టుకొని భస్మమైపోయేట్లు చేసింది. రాక్షసులు బ్లాక్ హోల్స్ వంటివారు. వీటి స్పైరల్ కదలిక వలననే నక్షత్రాలు కదులుతాయి. గజాసురుడిని పెద్ద బ్లాక్ హోల్‌గా భావించి ఇదివరకే చెప్పాను. ఈ రాక్షసులు సృష్టికి ఆటంకం కలిగిస్తారు. రాక్షసులను వ్యతిరేక అయస్కాంత శక్తులుగా భావించాలి. కారణం వారు ఎప్పుడూ సమీకృత దేవ కార్యాలైన యజ్ఞాలకు విఘ్నాలు కలిగించటమే. పదోత్పత్తి శాస్త్రాన్ని (ఎటిమాలాజికల్) బట్టి యజ్ఞం అంటే దేవ పూజ, దానం, సంఘటీకరణం. ఇది సృష్టికోసం అన్నిటినీ కలిపేది, ఏకీకృతం చేసేది, ఉండలు ఉండలుగా మార్చేది అని భావం. సంకర్షణం అంటే అయస్కాంత శక్తి.

## ఎనిమిదవ అధ్యాయం- విశ్వానికి ఆరంభం, దాని భవిష్యత్తు

**పేజీ-115; పేరా 01**

అయిన్ స్టీన్ శాస్త్రవేత్త దీరీ ఆఫ్ రిలేటివిటి ప్రకారం స్పేస్ టైం- బిగ్ బాంగ్ ఏకత్వం (సింగ్యులారిటి)తో ప్రారంభమైంది. అది అతిపెద్ద ఏకీకృత ప్రేలుడు (బ్రిగ్ క్రంచ్ సింగ్యు లారిటి)తో అంతమౌతుంది. విశ్వం అంతా మళ్ళీ వినాశన మవటం లేక ఒకేసారి బ్లాక్ హోల్‌లో ధ్వంసమైపోవటం జరుగుతుంది. ఈ బిలంలో పడిన ప్రతి వస్తువు ఒకేసారి నాశనమైపోతుంది. కాని గ్రావిటేషనల్ ప్రభావం బయట ఉంటుంది. ఇలాకాక క్వాంటం ప్రభావాన్ననుసరిస్తే పదార్ధ ద్రవ్య రాశి లేక శక్తి మళ్ళీ మిగిలిన విశ్వంలోకి ప్రవేశిస్తుంది. ఇది రాక్షసుల పునర్జన్మ లాంటిదే. బ్లాక్ హోల్ ఒకేసారి ఆవిరియై అదృశ్యమైపోతుంది. క్వాంటం మెకానిక్స్ ఇలాంటి నాటకీయ ప్రభావం బిగ్ బాంగ్ క్రంచ్ సింగ్యులారిటి చూపగలదా? విశ్వావిర్భ తొలికాలంలోను ఆ తర్వాత గ్రావిటేషనల్ క్షేత్రాలు బాగా బలీయంగా ఉన్నప్పుడు, క్వాంటం ప్రభావాలను విస్మరించలేనప్పుడు అసలేమి జరిగింది? అసలు ఈ విశ్వానికి మొదలు, తుది ఉందా? ఒకవేళ ఉంటే అవి ఎలా ఉన్నాయి?

**శాస్త్రీజీ భాష్యం-** వీటినే పురాణాలు వేదాలు చెప్పాయి. సృష్టి జీవితాన్ని కల్పం (సృష్టి) అంటారు. దీన్ని మహా యుగాలుగా విభజించారు. వాటిని యుగాలుగా, వీటిని మళ్ళీ లక్షలాది సంవత్సరాలుగా సూక్ష్మ విభజన చేశారు. ఇప్పుడు మనం ఉన్న కల్పం (ACON) శ్వేత వరాహ కల్పం. ఇది భూమికి సంబంధించినంత వరకు చాలా దూరం. శ్వేత వరాహ కల్పం ప్రారంభంలోనే భూమి కన్యారాశిలో లేక వరాహ నక్షత్ర కూటమిలో సృష్టింపబడింది అని ఇదివరకే తెలుసుకొన్నాం. అంటే మన భూమి, వరాహ నక్షత్ర కూటమి ఒకేసారి సృష్టింపబడినాయి. ఇది ముందే నిర్దేశింపబడిన కాలం వరకు ఉండి, గ్రహ నక్షత్రాలతో మళ్ళీ అంతమౌతుంది.

మన పురాణాలు ఈ కూటమిని పరిమితమైన కోణంలోనే చెప్పాయి. మిగిలిన గెలాక్సీల విషయంలోనూ ఇదే విధానం. అవికూడా ఇలాగే పరిణామం చెంది శక్తిలో లయం పొంది, నిద్రాణ స్థితిలో (డార్మంట్) కనిపించకుండా స్పష్టమైన శూన్యం (అపరెంట్ ఎంప్టినెస్) అనబడే అకాశంలో ఉండి, మళ్ళీ ప్రారంభ

విధానంలో పాల్గొంటాయి. కనుక సృష్టి అనేది ఒకేసారి (వన్ టైం) జరిగింది కాదని స్పష్టమౌతోంది. ఇది టైం, స్పేస్‌లో అంతులేనిదని, అనంతమైనదని స్పష్టం. ఇదే విషయాన్ని హాకింగ్ శాస్త్రజ్ఞుడు 116వ పేరాలో స్పష్టంగా చెప్పాడు. క్రిష్టియన్ మత గురువు పోప్‌గారు ఏర్పరిచిన సైంటిస్ట్‌ల సమావేశంలో– "సైంటిస్ట్‌ల సిద్ధాంతాలు బైబిల్ సిద్ధాంతాలతో ఘర్షణ పడుతున్నాయా?" అని అడిగినప్పుడు హాకింగ్ తెలియబరచాడు.

**పేజీ 116, పేరా 01**

మనం మాట్లాడుకొనే సబ్జక్ట్ విషయం ఆయనకు తెలియదని సంతోషించాను. కాన్ఫరెన్స్‌లో నేనిలా చెప్పాను– స్పేస్ టైం సంభావ్యత స్పష్టమని పరిమితమైనదని (ఫైనిట్) దానికి సరిహద్దు (బౌండరి) రెండూ లేవని అంటే దానికి ప్రారంభం, అంతమూ లేదని సంపూర్ణం (ఆబ్సల్యూట్) కాదని భావం. స్పేస్, టైం లకు సరిహద్దు లేదు. సృష్టి ఏర్పడిన క్షణం (మూమెంట్ ఆఫ్ క్రియేషన్) కూడా లేదు. **శాస్త్రిగారి వ్యాఖ్య–** ఇది అచ్చంగా మన భావనలనే ప్రతిబింబిస్తున్నాయి. సృష్టి ఒకే కాలంలో జరిగిన తంతు కాదు. అది పరిపూర్ణమూ (ఆబ్సల్యూట్) కాదు. స్పేస్, టైం లకు సరిహద్దు లేదు. అవి సరళ రేఖాత్మకం (లీనియర్) కాదు, అవి స్వభావరీత్యా చక్రీయమైనవి (సైక్లిక్) అంటే అవి ఎప్పుడూ కనిపిస్తూ మళ్ళీ ప్రత్యక్షమౌతూ ఉంటాయని అర్థం.

**పేజీ 116, పేరా 02**

ఈ భావాలను వివరించటానికి ఇతరులు క్వాంటం మెకానిక్స్ ఏ విధంగా విశ్వ ఆవిర్భావ, భవిష్యత్‌లపై ప్రభావితం చేస్తాయో తెలియాలి. ముందుగా అందరూ విశ్వాన్ని గురించిన చరిత్ర, దానిపై ఉన్న సాధారణ సిద్ధాంతాన్ని అర్థం చేసుకోవాలి. ఇదే "హాట్ బిగ్ బాంగ్ మోడల్". ఇది ఫ్రీడ్ మాన్ సైంటిస్ట్ వర్ణించిన మోడల్‌ను బిగ్ బాంగ్ థీరీకి ముందే ఊహించింది. ఈ మోడల్స్‌లో ఈ విశ్వ వ్యాపనలో అందులోని ద్రవ్యరాశి, లేక రేడియేషన్ చల్లబడుతుంది. విశ్వం రెట్టింపు అయితే, దాని ఉష్ణోగ్రత సగానికి పడిపోతుంది. ఉష్ణోగ్రత కణాల సగటు శక్తి లేక వేగాన్ని కొలిచేదే అయినప్పుడు ఈ చల్లదనం విశ్వంలోని పదార్థంపై పెద్ద ప్రభావాన్నే కలుగజేస్తుంది. ప్రతి అధిక ఉష్ణోగ్రత వద్ద, కణాలు న్యూక్లియర్ లేక ఎలక్ట్రో మాగ్నెటిక్ శక్తుల వలన, పరస్పర ఆకర్షణకు లోను కానంత వేగంగా, భ్రమణం

చెందుతుంది. ఒకవేళ అవి బాగా చల్లబడిపోతే, ఆకర్షించుకొనే కణాలు ముద్దలా (క్లంప్) అయిపోతాయి. ఇదే కాక విశ్వంలో ఉండే కణాలు ఉష్ణోగ్రత పైనే ఆధారపడి ఉంటాయి. అవసరమైన అత్యుష్ణోగ్రతల వద్ద కణాలు అధిక శక్తిని కలిగి, ఢీ కొన్నప్పుడు అనేక రకమైన కణాలు, వ్యతిరేక కణాల జంటలేర్పడి, అందులో కొన్ని యాంటి పారికల్స్‌ను తగిలినప్పుడు కొన్ని అంతమొందినా, మళ్ళీ అంతమొందిన వేగం కంటే మరింత వేగంగా మళ్ళీ ఏర్పడుతూ ఉంటాయి. తక్కువ ఉష్ణోగ్రతల వద్ద ఈ ఢీ కొనే కణాలు తక్కువ శక్తిని కలిగి ఉంటాయి. కణ జంటలు (కణాలు, యాంటి కణాల జంటలు) తక్కువ వేగంలో ఏర్పడి, పుట్టినంత వేగం కంటే అత్యంత వేగంగా అంతమొందుతాయి.

**శాస్త్రిగారి భాష్యం–** యజుర్వేదంలోని రుద్రాధ్యాయంలో నాలుగవ ఖండంలో సృష్టికర్తను "మహాగ్ని"గా అంటే "రుద్రుడు"గా చెప్పబడినాడు. మంత్రాలు స్తోత్రాలు ఈ రుద్రునికే చేస్తూ చల్లబడి విశ్వసృష్టిని చేయమని ప్రార్థిస్తారు. కోపంగా ఉండవద్దని అర్థిస్తారు. తర్వాత సృష్టిమొత్తాన్ని వర్ణించారు. భక్తుడు రుద్రుని తను కావించిన ఈ విశ్వాన్ని సర్వతో భద్రంగా, సంక్షేమ సౌభాగ్యాలతో వర్థిల్ల జేయవలసిందిగా వేడుకొంటారు. కనుక వేదంలో అగ్నికి గొప్ప ప్రాధాన్యం ఉంది. పాశ్చాత్యులు, భారతీయులుకాని చరిత్రకారులు వేద సంస్కృతిని అర్థం చేసుకోకుండా మనది అటవికమని, సంచార సంస్కృతీ అని ఈసడించారు. వ్యతిరేక కణాలను మించి కణాల ఉత్పత్తి జరగాలంటే ఒక క్రిటికల్ టేంపరేచర్ (క్లిష్ట ఉష్ణోగ్రత) అవసరం. కనుక వ్యతిరేక కణాలను జయించటానికి కణాలకు అగ్ని సాయం కావాలి. అందుకే పురాణాలలో దేవతలు ఏ ఆపద వచ్చినా శివుడు, కుమారస్వామి, విష్ణువు మొదలైన వారి దగ్గరకు పరిగెత్తి కాపాడమని మొరపెట్టుకొని రాక్షస సంహారం చేసి తమను రక్షించమని, యుద్ధంలో విజయం ప్రసాదించమని కోరుకొంటారు. శివుడు రుద్రుడే అని ముందే తెలుసుకొన్నాం. కుమారస్వామి అగ్ని తేజస్సు. విష్ణువు అంటే "ఆహవనీయాగ్ని అంటే సూర్యుడు". అంటే ఈ ముగ్గురూ అగ్నికి ప్రతిరూపాలే.

ఈ సందర్భంలోనే వేదం ఈ ప్రపంచం యజ్ఞం వలన సృష్టింపబడింది అని చెప్పింది. అంటే సంఘటీకరణం వలన ఏర్పడింది అని భావం. ఖచ్చితమైన వర్ణన కల శ్లోక తాత్పర్యం– ఇకదాని నొకటి ఆకర్షించే కణాలు ముద్దగా మారిపోతాయి. అదే దేవతల కార్యం. అందుకనే దేవతలను కణాలుగా వర్ణిస్తారు. వాళ్ళు అందరూ కలిసి సృష్టి చేస్తారు. వ్యతిరేక కణాలు– యాంటీ పార్టికల్స్ అంటే రాక్షసులు కణాలను విధ్వంసం చేస్తాయి అంటే సృష్టిని ధ్వంసం చేస్తారు.

పార్టికల్స్ సంఖ్య కంటే యాంటీ పార్టికల్స్ సంఖ్య చాలా ఎక్కువ కనుక సృష్టి నిరాఘాటంగా కొనసాగుతుంది. నిజానికి రాక్షసుల సంఖ్య దేవతల సంఖ్య కంటే ఎక్కువే. అందుకే ఎప్పుడూ అసురులు సురులపై దాడి చేస్తూ ఓడించే ప్రయత్నాలు చేస్తూ ఉంటారు. సురులు భరించలేక అగ్ని ప్రతికాత్మమైన శివుడినో విష్ణువునో రక్షించమని యుద్ధంలో గెలిపించ మని పరిగెత్తుతారు. ఇది ప్రతీకాత్మకంగా అన్యాపదేశంగా వేద పురాణాలు ఇచ్చిన విజ్ఞానం.

**పేజీ 119; పేరా 02**

అధిక ద్రవ్యరాసి గల తారలు గురుత్వాకర్షణలను సమతుల్యం చేయటానికి ఎక్కువ వేడిగా ఉండాల్సి అవసరం ఉంది. అప్పుడే న్యూక్లియర్ చర్యలు అధిక వేగంగా కొనసాగి తమలోని హైడ్రోజెన్‌ను వంద మిలియన్ సంవత్సరాలలో నశింపజేసుకొంటాయి. అప్పుడు కొద్దిగా సంకోచం చెంది, ఇంకా వేడిని గ్రహిస్తే హీలియంను భారమైన కార్బన్ లేక ఆక్సిజన్ మూలకాలుగా మార్పు చెందిస్తూ ఉంటుంది.

**శాస్త్రి గారి వ్యాఖ్యానం–** మొదటిసారిగా సృష్టి పొందినవి హడ్రోజన్, కార్బన్, ఆక్సిజన్‌లు అయితే విశ్వ స్వరూపంను తెలియజేస్తాయి. రుద్రాధ్యాయంలో కర్బనాధారంగా గడ్డిమొక్క మొట్టమొదట సృష్టి చేయబడింది. అందులోనే రెండవ అనువాకం సృష్టి ప్రారంభ దృగ్విషయాన్ని తెలియజేసింది. ఆ మంత్రాలు– నమో వృక్షేభ్యో హరి కేశేభ్యో– పశూనాం పతయే నమో నమో సస్పింజరాయ త్విషీ మతేపతీనాం పతయే నమో– దీని భావం: వృక్ష రూపంలో వాటి ఆకులు జటలుగా ఉన్న రుద్రులకు నమస్కారం. గడ్డి రూపంలో పసుపు ఎరుపులతో ప్రకాశించే రుద్రులకు నమస్కారం.

**పేజీ 122; పేరా 03**

అన్ సర్టెనిటి సూత్రం చెప్పి సూత్రాల పరిమితకి లోబడి సైన్సు కొన్ని సూత్రాలను చెప్పింది. ఏదో ఒక కాలంలో దాని స్థితి తెలిస్తే వీటి ప్రకారం విశ్వం ఎలా కాలంతో అభివృద్ధి చెందుతుందో చెప్పగలం. ఈ సూత్రాలను అసలు దేవుడే నిర్దేశించాడు. తరువాత విశ్వానికి ఆ సూత్రాలపై పరిణామం చెందే స్వేచ్ఛనిచ్చాడు. తాను మళ్ళీ ఇందులో జోక్యం కల్పించుకోలేదు. ఆయన ఎలా విశ్వం యొక్క ప్రారంభ స్థితి లేక ఆకృతిని ఎంచుకొన్నాడో? కాల ప్రారంభంలో

సరిహద్దు నియమాలేమిటి? ఈ ప్రశ్నలకు సమాధానాలు కావాలి. సాధ్యమైన ఒక సమాధానం ఏమిటీ అంటే మనకు అంతుబట్టని, అర్థం చేసుకోలేని కారణాలతో విశ్వ ప్రారంభాకృతిని దేవుడు ఎంచుకొన్నాడు అని.

**శాస్త్రీజీ కామెంట్–** ఇంత గొప్ప పుస్తకంలో అంత పెద్ద సైంటిస్ట్ అయిన స్టీఫెన్ హాకింగ్ నిర్ణయానికి రాగలడు అని మనం ఊహించలేము. ఉన్న వాస్తవ పరిస్థితిని ఆయన నిర్మోహమాటంగా అత్యంత వినయంగా ఒప్పుకొని చెప్పాడు. ఇది దేవుడికి లొంగిపోవటమా? కాదు కాదు. అది యదార్థ సత్యాన్ని గ్రహించటమే. భగవంతుని ఎవరు తాము చూడలేమని చెబుతారో వారికే తెలియబడతాడు అని కేనోపనిషత్ చెప్పింది (విజ్ఞాతం అవిజ్ఞాతం) జ్ఞానానికి ఒక సరిహద్దు రేఖ ఉంటుంది. దీన్ని దాటి సైన్స్ వెళ్ళలేదు. కాని వేదం ఎప్పుడో చెప్పింది– విశ్వ జీవితం యొక్క ప్రతి క్షణం దేవుని ఆజ్ఞకు లోబడే ఉంటుంది అన్నది. మరొక రకంగా దేవుడు ఈ క్షణంలో లేకపోతే అన్నది సిద్ధాంతాలకు అనుభవాలకు వ్యతిరేకం. వేద విధిలో మొదట్లోనే మహా విష్ణో రాజ్ఞయా ప్రవర్త మానస్య అని మంత్రం చెప్పుకొంటాం. దాని అర్థం ఇదే. అంటే విష్ణుమూర్తి ఆనతి ప్రకారం ఈ విశ్వం కదులుతోంది. దేవుడు విశ్వాన్ని వదిలి పెట్టలేదు. ఆయన కారణ ప్రభావాలలో (కాజ్ అండ్ ఎఫెక్ట్)తో కనిపిస్తున్నాడు. విశ్వం కారణ, ప్రభావాల చేత పరిపాలింపబడాలని భావించాడు భగవాన్. కాని ఆయన ఉపాదాన కారణం అవటం వలన– అంటే ప్రపంచానికి ఆయన పదార్థ ప్రదాత. కనుక ఆయనే కారణం ప్రభావం కూడా. ఈ సూత్రాల గురించే హాకింగ్ శాస్త్రవేత్త మాట్లాడుతున్నాడు.

**పేజీ 123; పరా 02**

ఒక అవకాశం ఏమిటంటే అస్తవ్యస్తమైన (కయాటిక్) సరిహద్దు నియమాలు. వీటివలన విశ్వం అనంతంగా నైనా ఉండాలి లేక అనంతమైన విశ్వాలు ఉండి ఉండాలి.

**వ్యాఖ్య–** భారతీయ వేద పురాణాలు ఒకే ఒక అనంతమైన విశ్వం బ్రహ్మాండం ఉన్నదని చెప్పాయి. అది గుడ్డు ఆకారంలో ఉంటుంది కనుక బ్రహ్మాండం అన్నారు. ఈ గుడ్డు ఆకారమే దాని సరిహద్దును చూచిస్తుంది. ఒక కల్పంలో బ్రహ్మాండానికి ఒక సరిహద్దు పరిమితమై ఉంటుంది. విశ్వానికి కాదు. ఎందుకంటే విశ్వం అంటే అత్మయే. మొత్తం మీద తేలింది ఏమిటి అంటే విశ్వం దేశకాలాలలో అనంతమైనది అని. కాని ప్రపంచాలు లేక సప్త లోకాలు సృష్టి చెంది నశిస్తాయి.

మళ్ళీ జన్మిస్తాయి, లయం చెందుతాయి. ఇది అంతా ఒక అంతులేని అనంత ప్రక్రియ.

**పేజీ 123; 124 చివరి వాక్యం తరువాత–**

మృదువైన ప్రదేశాలలోనే నక్షత్రాలు గేలాక్సీలు ఏర్పడ్డాయని అనుకొంటే, మనలాంటి స్వయం ప్రత్యుత్పత్తి చేయగల జీవుల అభివృద్ధికి తగిన పరిస్థితులు ఉన్నాయనుకొంటే, వారికి ప్రశ్నించలం వస్తే ఎందుకు ఈ విశ్వం మృదువుగా ఉందని అడిగితే? ఇదే సంబంధ సిద్ధాంతం (యాన్త్రోపిక్ ప్రిన్సిపల్)కు ఉదాహరణగా నిలిస్తుంది. దీనికి వివరణ ఇలా ఉంటుంది– ఈ విశ్వాన్ని అది ఉన్న స్థితిలో చూస్తున్నాము అంటే మాకు ఉనికి (ఎక్సిస్ట్) ఉన్నట్లే.

**శాస్త్రీగారి వ్యాఖ్యానం–** ఇక్కడ మృదువుగా (స్మూత్) అనే మాటను జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. అంటే శత్రు సంబంధమైనది కాదు (నాట్ హోస్టైల్). దీనికే వేదం శం అనే మాటను ఉపయోగించింది. శివుని శరీరమే విశ్వం కనుక ఆయనను శంకరుడు అన్నారు. శం కరోతి అంటే శాంతినిచ్చేవాడు లేక శాంతియే తానూ అయినవాడు. దేవుడు వస్తుతహా క్రూరుడు అంటే రుద్రుడు అంటే అతి శక్తిమంతుడు. కాని ఆయనను ప్రార్థిస్తే శంకరుడుగా మారుతాడు– అంటే తనలోని ఉష్ణాన్ని తగ్గించుకొంటాడు– ఎలా అంటే కణాలు మిగిలిన కణాల ఆకర్షణలోకి పోకుండా ఉండటం. ఈ విశ్వంలో అత్యుష్ణ పరిస్థితులు అంటే ఎక్కువ వేడి, ఎక్కువ కణాలు ఉన్నప్పుడు, అవి ఒకదానికొకటి దూరంగా పరిగెత్తుతున్నప్పుడు చల్లబడి ఉష్ణోగ్రత క్రమంగా తగ్గిపోతుంది. అప్పుడు నీరు ఏర్పడి స్వయం పునరుత్పత్తి చేయగల జీవరాశి సృష్టింపబడుతుంది. హైడ్రోజన్ హీలియంగా మారి, కార్బన్, ఆక్సిజన్ మూలకాలుగా విచ్ఛేదం చెందుతుంది. హైడ్రోజన్ ఆక్సీజన్‌లు కలిసి నీరుగా మారుతాయి. గడ్డిలో మొక్కలు, వృక్షాలలో ముఖ్యభాగంగా కార్బన్ మారిపోతుంది. శివుని మొదటి రూపం వృక్షం, గడ్డి యే (సస్పింజర). దీనికి ఉదాహరణ యజుర్వేదంలోని నాలుగవ కాండ మంత్రం–

నమో వృక్షేభ్యో హరి కేశేభ్యో పశూనాం పతయే నమ– సస్పింజిరాయ త్విషీమతయే పతీనాం పతయేనమః ఈ విషయాన్ని ఇదివరకే ఒకసారి చెప్పుకొన్నాం. హాకింగ్ వంటి గొప్ప శాస్త్రజ్ఞుడు స్మూత్ అనే మాటను ఉపయోగించటం. వేదం చెప్పిన శం (శాంతి) పదానికి సరిపోతోంది. అంకితభావంతో శాస్త్రజ్ఞులు చేసిన కృషిని తక్కువగా అంచనా వేయకూడదు.

**పేజీ 129, పేరా 1**

కాని, దీనికి కావాల్సిన శక్తి ఎక్కడి నుంచి వచ్చింది? అనే ప్రశ్న వస్తుంది

**వ్యాఖ్య–** వేద ఋషులు దీనికి సమాధానం చెప్పారు. వేదం ఎందరో దేవతల గురించి చెప్పింది. వీరికి శక్తి అంతా అమ్మవారి (మదర్ గాడెస్) నుంచే లభిస్తుందని చెప్పింది. శ్రీలక్ష్మీ దేవిని స్తుతించే స్తోత్రంలో మంత్రం దీనికి సమాధానం–

లక్ష్మీం క్షీర సముద్ర రాజ తనయాం– శ్రీ రంగ దామేశ్వరీం దాసీ భూత– సమస్త దేవ వనితాంలోకైక దీపాంకురాం– శ్రీ మన్మంద కటాక్ష లబ్ధ విభవత్ బ్రహ్మేంద్ర గంగాధరాం

భావం– బ్రహ్మ, విష్ణు, మహేశ్వర మొదలైన దేవతలు తమ శక్తులను శ్రీ లేక లక్ష్మీదేవి నుండి పొందుతారు. సంస్కృతంలో శ్రీ అంటే ఆమె అని అర్థం. ఆమెయే అందరికి శరణ్యం.

**పేజీ 129, పేరా 2**

గుత్ శాస్త్రవేత్త ఉచిత భోజనం అనేదిలేదు. కాని ఈ విశ్వం అంతిమ భోజనం అని చెప్పినట్లు–

**శాస్త్రిగారి భాష్యం–** ఉపనిషత్తులు ఆత్మ విశ్వంగా కనిపిస్తుంది అన్నాయి. అది 10 ఉపాదాన కారణంగా 20 నిమిత్త కారణంగా రెండు విధాల కనిపిస్తుంది. ఆత్మ అనేది ఒకప్పుడు విశ్వానికి మూలంగా, తయారు చేసేదిగా, ఆకారం ఏర్పరచేదిగా ఉండేది. సైంటిస్ట్‌లు తీవ్రంగా సమర్పణ భావంతో తమ తార్కిక శాస్త్రీయ విధానంలో కృషి చేసి, మన వేద ఋషులు వేలాది సంవత్సరాల క్రితం చెప్పిన సత్యాలనే తేల్చి చెప్పటం అత్యంత మనోహరంగా ఉంది.

**పేజీ 129, చివరి పేరా**

విశ్వం ద్రవ్యోల్బణం లాగా విస్తరించలేదు. దీనికేదో విధానం ఉండి ఉండాలి. ఆ విధానం అతి పెద్ద ప్రభాలశీల విశ్వోద్భవ స్థిర గుణాకాన్ని తొలగొంచటానికి సాయపడి ఉండాలి. అందుకని విస్తరణ రేట్‌ను వేగవంతమైన స్థితి నుండి గురుత్వ బలం వలన నిదానంగా మారేట్లు చేసి, ఇప్పుడు మనం చూస్తున్న స్థితిలోకి తెచ్చి ఉంటుంది.

**శాస్త్రిగారి వ్యాఖ్యానం–** సృష్టి రహస్యం అంటే ఇదే. వేదం దీన్ని గమనించింది. ఈ నెమ్మది తనాన్ని ఛందస్ అంది. దీన్నే ఇంగ్లీష్‌లో సమానార్థకంగా ప్రాసడి

అన్నారు. ఇదే పద్యానికి జీవం. ఇదంతా ఒక రకమైన గణనం. ఆ గణాల ప్రకారమే పద్యాలలో పంక్తులు మళ్ళీ మళ్ళీ వస్తాయి. ముక్త పద్యం (బ్లాంక్ వెర్స్) దీనికి ఉదాహరణ. కదలిక సృష్టికి కారణ భూతం. విశ్వవ్యాప్తి కూడా కదలికయే కదా. కవిత్వంలోని లయ వంటిది ఇది. ఇలాంటి వివిధమైన 7 రకాల చందస్సులు విశ్వంలో ఉన్నాయని వేదం చెప్పింది. ప్రతి ఛందస్సుకు అధి దేవత ఉంటుంది. దానికి పేరు ఉంటుంది. ఆ దేవత ఒకానొక రకమైన సృష్టికి కారణభూతమవుతుంది. ఉదాహరణకు శక్వరి ఛందస్సును తీసుకొందాం. ఈ ఛందస్సు ఆహారం, జంతువులు, మానవుల సృష్టికి కారణం అవుతుంది. పంక్తి అనే ఛందస్సు జంతు సృష్టికి కారణమౌతుంది. ప్రసిద్ధమైన గాయత్రి ఛందస్సు అన్ని రకాల గోవులను సృష్టిస్తుంది. ఇది చాలా విస్తృతమైన విషయం. దీన్ని విడిగా తెలుసుకోవాల్సిందే.

**పేజీ 136, పేరా 2**

యూక్లిడియన్ స్పేస్ టైం, అనంత ఊహాత్మక టైంకు పాకితే, లేక ఎక్కడో సింగ్యులారిటీ (ఏకత్వం)లో ఇమాజినరి కాలంలో మొదలైతే, విశ్వావిర్భ కాలాన్ని చెప్పే సంప్రదాయ సిద్ధాంతం ఉన్న సమస్యలే ఎదురౌతాయి. దేవుడికి విశ్వం ఎలా ప్రారంభమైందో తెలుసు. మనం అది ఎలా పురుడు పోసుకొన్నదో వివరించే ఏ ఒక్క కారణాన్ని చెప్పలేం. పైగా క్వాంటం థీరీ ఆఫ్ గ్రావిటి కొత్త అవకాశాన్ని ఆవిష్కరించింది. దాని ప్రకారం స్పేస్ టైంకు సరిహద్దు లేదు. అందుకని సరిహద్దు వద్ద ప్రవర్తన ఎలా ఉన్నదో ప్రత్యేకించి చెప్పాల్సిన అవసరం లేదు. సైన్సు సూత్రాలు విచ్ఛిన్నమైయే సింగ్యులారిటీలు లేవు. దేవుడిని ప్రార్థించటానికి ఉండే సరిహద్దు అంచులేదు లేక స్పేస్ టైంకు కొత్త సరిహద్దు నిబంధనలు ఏర్పాటు చేయమనటానికి వీలు లేదు. విశ్వానికి సరిహద్దు నియమం అంటే దానికి బౌండరీయే లేదు అన్న ఒక్క సత్యాన్ని మాత్రం నిశ్చయంగా చెప్పగలం. విశ్వం పూర్తిగా స్వయం సమృద్ధం, స్వయం నియంత్రణం (సెల్ఫ్ కంటైండ్). దానిని బయటి విషయం ఏదీ ప్రభావితం చేయలేదు. విశ్వం సృజింపబడదు, నశింపబడదు. ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది (బి).

**శాస్త్రిగారి భాష్యం–** హాకింగ్ శాస్త్రవేత్త గారి సైన్స్ ఈ రకమైన నిర్ణయాలకు వచ్చినందుకు అభినందించాలి. ఇది ఉపనిషత్, బ్రహ్మ సూత్రాల భావాలనే ప్రతిబింబిస్తోంది. వేదాంతం ప్రకారం ఆత్మ అనేది అనంతమైనది. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అనేది ఉపనిషద్వాక్యం. సృష్టికి కారణం అనేది శాశ్వతమైనది

(ఎటర్నల్) సర్వజ్ఞమైనది (ఆమ్నిసెంట్), అనంతమైనది (ఇన్ఫినిట్). చూసేది అదే కనుక ఎప్పుడూ సృష్టింపబడదు.

వేరొకటి ఏదీ దాన్ని చూడలేదు. అందుకే అది ద్రష్ట అయింది. అంటే చూసేదే కాని చూడ బడేది కాదు నతు దృశ్యతే. అది చూడబడలేదు, తెలియబడదు, దాన్ని ఆత్మ జ్ఞానం వలన అనుభవించటం ద్వారానే తెలియబడుతుంది. అంటే చూసేవాడు చూడబడే వాడితో ఐక్యమైనప్పుడే ఇది సాధ్యమౌతుంది. అంటే ఆత్మ పరమాత్మలో చేరినప్పుడే. అదే మొత్తుకొన్నాడు హాకింగ్ శాస్త్రవేత్త– "It would just Be' అంటూ. ఈ విషయాన్ని అద్వైత సిద్ధాంత వ్యాపకులు శంకరాచార్య స్వామి బాగా ప్రచారం చేశారు. ఇదే ఏకత్వం లేక అద్వైతం. దాని ప్రకారం సృష్టికర్త బ్రహ్మం ఒక్కడే. రెండోవాడు లేదు. దీని ప్రాతిపదిక మీద సిద్ధాంతాన్ని వ్యాప్తి చేస్తూ ఆత్మ అనేది ఎప్పుడూ ఉంటుంది అంటే నిత్యం అని ముగించారు. ఆత్మ సృష్టింపబడదు, నశింపబడదు. కారణం అదెప్పుడూ సృష్టింపబడలేదు కాబట్టి. దృశ్య ప్రపంచమంతా భౌతిక దృష్టికి చెందినదే. హాకింగ్ చెప్పిన ఏకత్వ సిద్ధాంతం కూడా ఇదే. విశ్వం స్వయం సృష్టి (సెల్ఫ్ కంటైండ్). దీనిని బయటి శక్తులేవీ ప్రభావితం చేయలేవు. అది ఎప్పటికీ సృష్టింపబడదు. నశించదు ఎప్పుడూ ఉంటూనే ఉంది.

మన మహర్షులు ఆత్మను యెంత స్పష్టంగా దర్శించి వివరించారో తెలుస్తోంది. విశ్వం అంటే స్వయం నియంత్రణ కలది. ఆత్మను శంకరులు గొప్ప పోలికతో చెప్పారు. అదే రజ్జు సర్ప భ్రాంతి. తాడును చూసి పాము అనుకోవటం. దీని గురించి ఇదివరకే చెప్పుకొన్నాం. దేవుడు మానవులకు ఈ విశ్వరూపంలో కనిపిస్తాడు. ఇంద్రియ నిగ్రహంతో స్థిరమైన మనసుతో ఉంటే మనకు కనిపించేది వస్తు సముదాయము కాదు పరమాత్మయే.. అంటే సృష్టి కారణ భూతుడే. కాని అప్పుడు సృష్టి కనిపించదు అంటే ప్రభావం (ఎఫెక్ట్) కనిపించదు అన్నమాట. ప్రపంచ సృష్టింపబడినట్లు నాశనమైనట్లు భ్రాంతి పొందుతాం. వాస్తవానికి సృష్టీ లేదు, వినాశనమూ లేదు. కనుక విశ్వావిర్భావమూ లేదు, అంతమూ లేదు. అది ఎల్లప్పుడూ ఉంది, ఉంటుంది. స్టీఫెన్ హాకింగ్ దృష్టిలో అదే ఇట్ జస్ట్ వుడ్ బి.

అందుకే మన ఉపనిషత్తులు సృష్టికర్త అనే మాట వాడకుండా చాలా జాగ్రత్త పడ్డాయి. అవి ఎప్పుడు చెప్పినా సృష్టికి కారణం అనే చెప్పాయి. మనకు సృష్టి కారణం భ్రాంతిగా భాసిస్తుంది. అంటే మన మనసులలోనే ఏర్పడుతుంది.

దైవం ఎప్పుడూ సృష్టి చేయాలని సంకల్పిచడు. దీనికి కారణం ఆయన సంకల్ప, వికల్పాలకు అతీతుడు. ఆయన నిర్వికల్పుడు. ఇదే హాకింగ్ మాటలలో సెల్ఫ్ కంటైండ్ అండ్ నాట్ ఎఫెక్టెడ్ బై ఎని థింగ్ అవుట్ సైడ్ ఇట్. మన పురాణాలు కూడా దీనిని బాగానే వివరించాయి. వేద, ఉపనిషత్‌లను అర్థం చేసుకోవటానికే పురాణాలు తోడ్పడుతాయి. సృష్టికర్తలలో ఒకరైన శివుని గురించి పురాణం చెప్పింది. ఆయన వస్తుతహా అభవుడు అంటే పుట్టుక లేనివాడు లేక పుట్టనివాడు ఆయనకు చావు లేదు కనుక మృత్యుంజయుడు. పుట్టని వాడికి చావు లేదు కదా. పుట్టుక, నాశనం లేని దానికి స్వభావం (నేచర్) ఏమిటి? ఎప్పుడూ ఉండటమే- అదే హాకింగ్ గారి మంత్రం- ఇట్ వుడ్ జస్ట్ బి.

**పేజీ 139, పేరా 02**

అందుకని మనం అనుకొనే ఇమాజినరి టైం (ఊహా కాలం) నిజంగా ఎక్కువ ఆధారపడేదిగా కనిపిస్తోంది. మనం అనుకొనే వాస్తవం అనుకొన్న విశ్వాన్ని వివరించటానికి మనం సృష్టించుకొన్న అయిడియా అది. నేను మొదటి అధ్యాయంలో చెప్పిట్లు శాస్త్రీయ సిద్ధాంతం అనేది ఒక గణిత ప్రతిరూపమే (మోడల్). ఈ మోడల్‌తో మన పరిశీలనలను వివరిస్తాం. ఇది మన మనసులలో మాత్రమే ఉంటుంది. కనుక వాస్తవ, ఊహాత్మక కాలం ఏది అని ప్రశ్నించటం అర్థరహితం. కనుక అదే పనికొచ్చే వర్ణన చేయటానికి సహాయపడే విషయం.

**శాస్త్రి గారి కామెంట్-** సైంటిస్ట్‌లు నిజాయితీగా లోచించేవారు. వారు ఒకసారి సైన్స్ అనేది మనసు లేక మెదడు (మైండ్)లోనే ఉంటుంది అంటారు. కనుక అది సత్యానికి బద్ధం కాదు. స్వతంత్రమైనది శాస్త్రమే అయిన పదాలు, భాష మానవుడు తయారు చేసిందే. అవి సంఘటనలను మాత్రమే వర్ణించగలవు. అవి కాలం నిజమైనదా ఊహ నిజమైనదా అనేది చెప్పలేవు. కాలం భగవత్ సృష్టిలో మొదటిది కనుక మాటలు దైవాన్ని వర్ణించలేవు. మాటలు మనసుతో కలిసి దేవుని సమీపానికి చేరి తిరిగొస్తాయి, కాని దేవుని వర్ణించలేవు అని ఉపనిషద్వాక్యం. దీనికి శ్లోకం-

యతో వాచో నివర్తం తే అప్రాప్య మనసా సహా.

**పేజీ 140, చివరి వాక్యం. 141 పేజీలో వాక్యాలు:**

సృష్టికి ఆరంభం ఉంది అనుకొంటే, దాన్ని సృష్టి చేసినవాడు ఒకరు ఉండాలి.

కాని విశ్వం స్వీయ నియంత్రమైతే (సెల్ఫ్ కంటైంట్) సరిహద్దే లేకపోతే, అంచు ఉండకపోతే, దానికి ఆది అంతం ఉండదు. అది అలా ఉంటూనే ఉంటుంది. అప్పుడు సృష్టికర్తకు స్థానం ఉండదు కదా.

**శాస్త్రిగాని వ్యాఖ్యానం–** ఉపనిషద్వేదాంతం ఈ సమస్యను సృష్టికర్తను సృష్టితో గుర్తించి (ఐడెంటిఫై) పరిష్కరించింది. అదే సెల్ఫ్ లేక ఆత్మ. మనం ప్రపంచాన్ని చూస్తున్నా ప్రపంచంలో ఒకరం అయిన మనల్ని మనమే చూసుకొంటున్నా మనం చూస్తున్నది ఆత్మనే. ఈ విషయంలో సైంటిస్ట్ హాకింగ్ ఒక అడుగు ముందుకు వేసి సృష్టి, సృష్టికర్త ఒకరే అనేశాడు. అలా చెప్పి ఉండకపోతే సైన్సు, ఆధ్యాత్మికత వేరు వేరే అనేది రుజువు చేసినట్లు అయ్యేది. ఆ సందేహం రాకుండా స్పష్టంగా చెప్పాడు ధైర్యంగా. మతపరమైన అనుభవాలు సైంటిఫిక్ వాదాల జోలికి వెళ్ళకుండా నిషేదానికి గురి అయ్యేవి. సాధారణంగా సైంటిస్ట్‌లకు మత దృక్పథం ఉండదు. కాని నా దృష్టిలో హాకింగ్ సైంటిస్ట్ దేవుడు ఉన్నాడని నమ్ముతాడు అనిపిస్తుంది. ఆయన రాసిన ఈ పుస్తకం ఎక్కడ చెప్పినా భగవంతుడు ఉన్నాడు అన్న భావమే గోచరిస్తుంది. అది టేకెన్ ఫర్ గ్రాంటెడ్ అనుకోవచ్చు. మనం అంటే మనం అనుకొన్నది ఆయనకు అంగీకారమేనని అర్థం. తన నిజాయితీ అనుమానాన్ని ప్రశ్నించాడు.

భారతీయ తర్క శాస్త్రం కూడా దేవుడు ఉన్నాడనే అన్నది. కాని ఆయన ఉనికిని రుజువు చేసే జోలికి పోలేదు. అదే తెలివైన పని. లాజిక్ అంటే తర్కం ఏ సంఘటన జరగాలన్నా నాలుగు ముఖ్య కారణాలు ఉంటాయని చెప్పింది. అవి 1) ఈశ్వరుడు 2) అదృష్టం 3) దేశం 4) కాలం. ఇందులో మొదటిదే దైవం.

## తొమ్మిదవ అధ్యాయం– కాలశరం (ది యారో ఆఫ్ టైం)

**పేజీ 145; పేరా 2**

కాలంతో ఎంట్రోపిలేక రుగ్మతలేక కల్లోలం అనేది కాలశరంకు ఒక ఉదాహరణ. ఇది గతానికి, భవిష్యత్తుకూ విభజన రేఖగా ఉంటుంది. కాలానికి మార్గనిర్దేశం చేస్తుంది.

ఇది థెర్మో డైనమిక్స్‌లో రెండవ సూత్రాన్ని అనుసరిస్తుంది– ఆ సూత్రం

మూసేసిన ఏ వ్యవస్థ లేక ఎంట్రోపి కాలంతోబాటు పెరుగుతుంది.

**శాస్త్రిగారి వ్యాఖ్యానం–** ఈ వాక్య నిర్మాణమే విడ్డూరంగా ఉంది. అది ఇలా మూయబడిన ఏ వ్యవస్థలోనైనా రుగ్మత లేక ఎంట్రోపి, ఎప్పుడూ కాలంతో పెరుగుతుంది అని ఉండాలి. భారతీయ సాహిత్యం ముఖ్యంగా వేదాంత సాహిత్యం మానవ శరీరానికి ఒక భావయుక్తమైన మంచి నిర్వచనం చెప్పింది. అదే శరీరం. దీని నిర్వచనం– శరావత్ గచ్ఛతే ఇతి శరీరః అంటే బాణం లాగా దూసుకుపోయేది. అందుకని హాకింగ్ శాస్త్రవేత్త ఈ అధ్యాయానికి కాల శరం అని పేరు పెట్టాల్సింది.

**పేజీ 146; పేరా 01**

ఒక వ్యవస్థ ఆదేశింపబడిన అతి తక్కువ స్థాయి నుండి ప్రారంభమైనదని అనుకొంటే, కాలం గడిచిన కొద్దీ ఆ వ్యవస్థ సైన్సు సూత్రాలనాధారంగా మార్పు చెందుతుంది (ఇన్వాల్వ్). దాని స్థితి మారుతుంది. మరి కొంతకాలం తర్వాత ఆ వ్యవస్థ ఆదేశించిన దానికంటే అస్తవ్యస్థంగా కల్లోలంగా మారే అవకాశం ఉండచ్చు. ఎందుకంటే ఇంకొన్ని ఇలాంటి స్థితులే ఉన్నాయ కనుక. ఈ వ్యవస్థ మొదట్లో ఒక ఉన్నత ఆదేశానికి విధేయంగా ఉండి ఉంటే ఈ రుగ్మత కాలాన్ని బట్టి పెరుగుతుంది.

**వ్యాఖ్య–** ఈ చర్చ చూడటానికి చాలా సాధారణమైనదే అనిపించినా చాలా నైరూప్యమైనది (అబ్ స్ట్రాక్ట్) ఈ పరిస్థితిని వేదం గుర్తించి చర్చించింది. పురాణాలు అనుసరించాయి. ఇక్కడ యజుర్వేద రుక్‌ను తెలియజేయాలి. ఈ రుగ్మత లేక అస్తవ్యస్తత అంటే రాక్షసులే. దీన్ని దర్శ పూర్ణ మాసయజ్ఞం, సోమయాగాలలో చర్చించారు. యజుర్వేదంలో ఈ మంత్రం మరల మరల వస్తుంది. యో ఆస్మాన్ ద్వేష్టి యంచ వయం ద్విష్మః. భావం– మనల్ని ద్వేషించే శత్రువు మనం ద్వేషించే శత్రువే.

నిజానికి దీన్ని యజుర్వేదం గుర్తించింది. ఋషులు అనుసరించారు. అందుకే ప్రతి వైదిక కర్మ శాంతి కోసమే. అశాంతి అస్తవ్యస్తత కల్లోలం రూపు మాపటమే. దీని మహర్షులు గుర్తించారు. విశ్వంపై దయ చూపించే దేవుడు శంకరుడు. అస్తవ్యస్త రుగ్మతా స్థితియే రుద్రుడు. దేవతలు ఆదేశాలు, అసురులు ఎంట్రోపి, లేక రుగ్మత లేక కల్లోలం. సృష్టి ప్రారంభంలోనే ఈ ఇద్దరికీ నిర్దిష్ట విధులను ఆదేశించారు. ఇదే హయ్యర్ ఆర్డర్– అంటే ఉత్తమ స్థితి. దీని తర్వాత రాక్షసులు ఘోర తపస్సు వలన బ్రహ్మాది దేవతల వరాల వల్ల శక్తివంతులయ్యారు.

చేతులు కాలాక ఆకులు పట్టుకొన్నట్లు అప్పుడు విష్ణుమూర్తి దగ్గరకు పరిగెత్తటం, ఆయన జోక్యం చేసుకోవటం ఉండనే ఉంది. దీనిపై చెప్పాల్సింది చేటలలో చాలా ఉంది.

**పేజీ 147; పేరా 02**

కంప్యూటర్ మెమరీ రెండు స్థితులలో ఏదో ఒకదానిలో ఉండే మూలకాలంతో కూడిన వ్యవస్థ. చిన్న ఉదాహరణ– అబాకస్– అంటే పిల్లలు లెక్కలు నేర్పించే చిన్న పూసల చట్రం. అతి సాధారణంగా ఇందులో అనేక తీగలు, ప్రతి తీగ మీద ఒక పూస, దాన్ని ఒకటి లేక రెండు స్థానాలలో జరిపే వీలు ఉంటుంది. కంప్యూటర్ మెమరీలో ఒక విషయాన్ని రికార్డ్ చేసేముందు అది రుగ్మత లేక అస్తవ్యస్త లేక కల్లోల స్థితిలో ఉంటుంది. ఒక అంశాన్ని కంప్యూటర్ మెమరీలో రికార్డ్ చేసేముందు సమాన సంభావ్య స్థితుల కోసం రెండు స్థితులలో ఉండి, మెమరీ విస్మరణ స్థితిలో ఉంటుంది. అబాకస్ తీగల మీద పూసలు చెల్లా చెదురుగా ఉంటాయన్నమాట. సిస్టంతో గుర్తుంచుకోవలసిన దానితో మెమరీ అనుసంధానమైన తర్వాత వ్యవస్థ రెండిటిలో ఏదో ఒక స్థితిలో తప్పకుండా వచ్చేస్తుంది. అబాకస్ పూసల తీగలపై ఎడమ లేక కుడివైపు చేరిపోతాయని అర్థం. కనుక జ్ఞాపకశక్తి లేక మెమరి ఒకానొక అస్తవ్యస్థితి నుండి ఆదేశించే స్థితిలోకి వస్తుంది. మెమరీ సరైన స్థితిలో ఉండటానికి కొంత శక్తిని వినియోగించాలి (పూసలను కదిలించటానికి, కంప్యూటర్‌కు శక్తిని అందించటానికి లాగా). ఈ శక్తి చెదిలిపోయి ఉష్ణంగా మారి, విశ్వంలో రుగ్మతను, కల్లోలాన్ని మరింత పెంచుతుంది. ఆదేశిత మెమరీ కంటే ఈ అస్తవ్యస్థత ఎక్కువగా ఉంటుంది. ఈ విధంగా కంప్యూటర్‌కున్న కూలింగ్ ఫాన్ వెలువరించే ఉష్ణం అంటే ఒకసారి కంప్యూటర్ మెమరీలో రికార్డ్ అయ్యాక, విశ్వంలోని మొత్తం రుగ్మత కల్లోలం మరింత పెరుగుతుంది. కంప్యూటర్ గతాన్ని జ్ఞాపకం చేసుకొనే కాలమార్గం ఆ స్థితిలో, రుగ్మత పెరిగే దానితో సమానంగా ఉంటుంది.

**శాస్త్రిగారి భాష్యం–** ఈ భావాలన్నీ మన పురాణాలలో ఉన్నవే. సృష్టికర్త లేక చతుర్ముకబ్రహ్మ దేవాసురలను అంటే ఆర్డర్ మరియు డిసార్డర్‌లను సృష్టించాడు. రాక్షసులు తపస్సు చేస్తే డిసార్డర్ పెరిగి ప్రపంచంలో ఉష్ణం పెరిగిపోతుంది. పురాణాలు ఈ ఉష్ణాన్నే ప్రపంచాన్ని కాల్చటంగా భస్మం చేయటంగా చెప్పాయి. దీనితో సువ్యస్థితం ఉన్నది. అస్తవ్యస్తమై పోతుంది, కల్లోలానికి గురౌతుంది. దేవతలు

అంటే సువ్యవస్థ విష్ణువును చేరి రక్షించమని ప్రార్థిస్తారు. విష్ణుమూర్తి ఏదో ఒక అవతారం దాల్చి, అవ్యవస్థకున్న మూల రూపాన్ని, కారణాన్ని ధ్వంసం చేసి మళ్ళీ వ్యవస్థను సుస్థిరం చేస్తాడు. అందుకే విష్ణుమూర్తి అవతారాలు అనంతం. అందులో దశావతారాలు చాలా ముఖ్యమైనవి. కపిల, వేదవ్యాస మొదలైన మహర్షులు విష్ణువు అవతార స్వరూపులే.

**పేజీ 148; పేరా 02**

సాధారణ సాపేక్ష సిద్ధాంతం విశ్వం ఎలా ప్రారంభమైందో ఊహించలేకపోయింది. కారణం సైన్సుకు తెలిసిన అన్ని సూత్రాలు బిగ్ బాంగ్ సింగులారిటి (ఏకత్వ) సిద్ధాంతంతో తుడిచి పెట్టుకుపోయాయి.

**వ్యాఖ్య–** దీన్ని మనం ఆత్మయొక్క సంకల్ప పూర్వస్థితి అనవచ్చా? హాకింగ్ దీనినే ప్రీ డెసిషన్ స్టేజ్– అన్నాడు అంటే అప్పుడు సైన్స్ సూత్రాలేమీ లేవన్నమాట. ఆత్మ అంటే సృష్టికర్తయే అని ఇదివరకే చెప్పుకొన్నాం. ఆయనే సూత్రాలను, శాస్త్రాన్ని చేస్తాడని ఉపనిషత్తులు ఉద్ఘోషిస్తున్నాయి. వీటిని ఉపనిషత్తులు కవితాత్మకంగా సో అకామయత, బహుస్యాం ప్రజయేత్ అన్నాయి. భావం– ఆత్మ అనేకాన్ని సృజించాలనుకొన్నది అంటే ఏకరూపం బహురూపం కావాలని భావించింది. ఈ నిర్ణయానికి లేక భావనకు ముందు ఆత్మ ఒక్కటే ఉంది, రెండవది ఏదీ లేదు. బహురూపంగా విస్తరించాలన్న ఆత్మ సంకల్పం సైన్స్ సూత్రాలు అనుసరించాయి. ఈ సూత్రాలు లేకపోతే సృష్టికి అవకాశం లేదు. సృష్టి తనతో సూత్రాలను తెచ్చుకొంటుంది. లయం అయినప్పుడు తనతోపాటు తీసుకొని వెడుతుంది.

**పేజీ 152; పేరా 03**

ఏమైనా మీరు ఈ పుస్తకాన్ని చదువుతున్నప్పుడు, ఆహార రూపంలో ఉన్న కనీసం వెయ్యి కేలరీల సువ్యవస్థిత ఉష్ణాన్ని. అవ్యవస్థిత శక్తిగానే చుట్టూ ఉండే గాలి నుంచి గ్రహించి వేడి, చెమట రూపంలో మార్చి ఉంటారు. ఇది విశ్వంలో ఇరవై మిలియన్ మిలియన్ మిలియన్ మిలియన్ యూనిట్ల రెట్లు అవ్యవస్థను ఏర్పాటు చేసి ఉంటుంది. ఈ పుస్తకంలోని ప్రతి విషయాన్నీ నువ్వు గుర్తుంచుకోవాలంటే నీ బుర్రలో పది మిలియన్ మిలియన్ మిలియన్ రెట్ల డిసార్డర్, కల్లోలాన్ని పెంచుతుంది.

**శాస్త్రిగారి మహా భాష్యం–** ఇది సైన్సు చెప్పిన విషయం కనుక మనం తప్పక

నమ్మాలి. ఇదే విషయాన్ని మన పురాణాలు చెప్పాయంటే నమ్ముతామా? ఇంతకీ అవి ఏం చెప్పాయి? ఎవరైనా తపస్సు చేస్తుంటే ప్రపంచంలో వేడి పెరిగి అవ్యవస్థ మౌతుంది. సువ్యవస్థకు రాజైన ఇంద్రుడు అప్సరసలను పంపి, ఆ ఉష్ణానికి కారణమైన దానిని నాశనం చేసి అవ్యవస్థను కూల్చేస్తాడు. సంస్కృతంలో అప్సరస అంటే నీటి ప్రవాహం. వేద విజ్ఞానం యెంత గొప్పదో యెంత ఆలోచనా పరమైనదో దీనివలన తెలుస్తోంది. మహర్షులు తపస్సు చేస్తున్నా ఈ వేడి పుట్టి జగత్ సంక్షోభానికి కారణమవుతుంది. దీనిని ఆపటానికి కూడా నీరే కావాలి. ఈ వేడికి అగ్నిపర్వతాలు బద్దలౌతాయి, సముద్రాలు పొంగుతాయి. దిక్పాలకులు ఒణుకుతూ బెదిరిపోతారు. వీటిని చిత్రాలుగానూ చూసి ఉంటాం. మనుల తపస్సును అప్సరసలు ఆపకపోతే, తనకంటే బ్రహ్మజ్ఞానులైన వారిని ఇంద్రుడే దిగి వచ్చి నచ్చ చెప్పటం తెలుసు మనకు. రాక్షసుల తపస్సు వేరొక రకం. వారికి ఇంద్రుని కూలద్రోసి, అవ్యవస్థను కల్లోలాన్ని కలిగించి ఇంద్ర పదవి పొందటం అనే ఆశతో తపస్సు చేస్తారు. వీళ్ళ తపోభంగానికి అప్సరసలు అందచందాలు, కులుకు ఒయ్యారాలు ఏవీ పనిచెయ్యక అప్సరసలే నీరు కారిపోతారు. అప్పుడు విశ్వ సృష్టికర్తే దిగి వచ్చి ఆ పాపాత్ముల ముందు రాజదండంతో ఒంగి వాళ్ళు కోరిన వరాలిచ్చి సంతృప్తి పరుస్తాడు, జగత్కల్లోలాన్ని తగ్గిస్తాడు.

## పదవ అధ్యాయం- భౌతికశాస్త్ర ఏకీకరణ సిద్ధాంతం

**పేజీ 155; పేరా 01**

మొదటి అధ్యాయంలో వివరించినట్లుగా విశ్వంలోని అన్ని విషయాలను కలిపి ఒకేవిధమైన సిద్ధాంతం నిర్మించటం చాలా కష్టం. దీనికి బదులు కొంత పరిమితితో జరిగే విషయాలను, మిగిలిన ప్రభావాలను వదిలేసి లేక ఉజ్జాయింపుగా కొన్నిటికే చేసి పాక్షిక సిద్ధాంతాలను తయారు చేయటానికి ముందడుగు వేశాం.

**శాస్త్రీజీ కామెంట్-** ఈ కష్టం హిందూ పురాణాలలోనూ ఉంది. వివిధ పురాణాలు వేర్వేరు సందర్భాలలో రచింపబడినాయి. వీటన్నిటినీ సమీకృతం చేయటం కష్టమే కాని అసాధ్యం మాత్రం కాదు. కొన్ని పురాణాలు శివుడే విశ్వానికి సృష్టికర్త ఆయనే శాశ్వతం అని ప్రకటించాయి. ప్రధానంగా శివుడు అగ్ని రూపుడు వేదం అగ్ని సృష్టికి కారణమని చెప్పింది. కొన్ని పురాణాలు విష్ణువే సృష్టికర్త అని చెప్పాయి.

ఆయనను నారాయణుడు అన్నాయి. అంటే జ్ఞానానికి, నీటికి నివాసం అని అర్థం. పురాణాలు నీరే అని భావించి సృష్టికి నీరే కారణమన్నాయి. ఋగ్వేదం ఇతర దేవతల కంటే వరుణదేవుడికి పైస్థాయినిచ్చి ప్రాధాన్యమిచ్చింది. పురాణాలు వివిధ సందర్భాలలో రాయబడినాయని ముందే చెప్పుకొన్నాం. ఋగ్వేదం ఈ దేవతలందరికి మహర్షులు వేరు వేరు పేర్లు పెట్టారని, వీరంతా సత్యంకు ప్రతిరూపాలని సత్యం ఒక్కటేనని చెప్పింది. అదే "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అంటే సత్యం ఒక్కటే. ప్రవక్తలు వివిధ నామాలు పెట్టారు.

**పేజీ 157; పేరా 01**

ఏడవ అధ్యాయంలో చెప్పినట్లు అనిశ్చిత సూత్రం లేక సిద్ధాంతం (అన్ సర్టైనిటి ప్రిన్సిపుల్) అంటే అర్థం ఖాళీ స్థలం కూడా వాస్తవిక, అవాస్తవిక అంటే కణాలు, ప్రతికణాలు జంటలతో నిండి ఉంటుంది అనటంలో ఇబ్బంది వస్తోంది. ఈ కణాలకు అనంత శక్తి ఉండి ఉండాలని, అందువలన అయిన్ స్టీన్ ప్రసిద్ధ సిద్ధాంతం E=mc2 ప్రకారం వాటికి అనంత ద్రవ్యరాశి ఉండి ఉండాలి. గురుత్వాకర్షణ బలం విశ్వాన్ని వక్రత చెందించి అనంత చిన్న విశ్వాలుగ మార్చి ఉండచ్చు.
**వ్యాఖ్య-** ఇదే శక్తి సిద్ధాంతం. అంటే శక్తియే జగత్ సృష్టి కారణం.

**పేజీ 165; చివరి పేరా**

కానీ అసలు అలాంటి ఏకీకృత సిద్ధాంతం ఉంటుందా? లేక మనం ఎండమావుల వెంట పరిగెడుతున్నామా? 3 రకాల అవకాశాలున్నాయి. 1)పూర్తి సంపూర్ణ ఏకీకృత సిద్ధాంతం ఉంది. మన దగ్గర దమ్ము, శక్తి ఉంటే ఏదో ఒకరోజు దాన్ని కనిపెట్టగలం. 2) ఈ విశ్వానికి అంతిమ సిద్ధాంతం లేనే లేదు కానీ అనంతమైన సిద్ధాంత క్రమం ఉండి, విశ్వాన్ని మరింతగా ఖచ్చితంగా వివరించగలుగుతుంది. 3) అసలు విశ్వానికి సిద్ధాంతమే లేదు. సంఘటనలను ఒక కొంత పరిమితి దాటి ముందస్తు అంచనా వేయలేము, ఒకోసారి అవి యాదృచ్ఛికంగా, ఏకపక్షంగా ఏర్పడవచ్చు.
**శాస్త్రిగారి వ్యాఖ్యానం-** ఈ మూడిటిలో వేద జ్ఞానం చివరిదాన్ని నిర్ణయించుకొని అందులో రెండవది ఒక భాగం అని చెప్పినట్లనిపిస్తుంది. ఈ కింది విధంగా దాన్ని విస్తరించి చెప్పవచ్చు.

ప్రపంచం 7 లయలకు లోబడి నడుస్తుంది అని ప్రవచించింది. అవే

సంస్కృతిలో గాయత్రీ, త్రిష్టుప్, జగతి, అనుష్టుప్, ఉష్ణిక్ మొదలైన ఛందస్సులు అని ఇదివరకే తెలుసుకొన్నాం కనుక విశ్వం ఈ ఏడు ఛందస్సుల ఆధీనంలో పాలింపబడుతోంది. ఇందులో గాయత్రి, త్రిష్టుప్, జగతి అనే మూడు ఛందస్సులు సమస్త విశ్వాన్ని పాలిస్తున్నాయి. వీటినే అలంకార యుతంగా వసు, రుద్ర, ఆదిత్యగా 8, 11, 12,సంఖ్యలుగా చెప్పారు. ఇవి వేదసాహిత్యంలో ముఖ్యంగా భగవద్గీతలో పదే పదే చెప్పబడినాయి. వీటిని విష్ణు (వసు), రుద్రా (త్రిష్టుప్), ఆదిత్య (గాయత్రి)గా గుర్తించి చెప్పారు. ఇందులో విష్ణువు సృష్టికర్త, రక్షకుడు. రుద్రుడు నాశన లేక లయ కారకుడు. ఆదిత్యుడు కొనసాగించేవాడు. వీరి రాజ్యాలు స్వతంత్రమైనవి (ఇండిపెండేంట్), వేరొకదాని ఆధారం లేనివి (ఒవెర్లాప్), రద్దు అయ్యేవి కావు (సూపర్ సీడ్). ఈ ముగ్గురు దేవతలు "శక్తి దేవి" కి లేక ఆమె కుమారుడు గణపతికి అధీనమై ఉంటారు. గణేశుడు గేలాక్సీలు, నక్షత్ర మండలాలతో కూడిన సకల విశ్వానికి ప్రతినిధి. ఆయన శక్తి సామర్థ్యాలు అగణితమైనవి- అపరిమేయమైనవి.

**పేజీ 166; పేరా 02**

దేవుడు మనసు మార్చుకొని ఉండచ్చు అని దేవుని ఊహిస్తూ సెయింట్ అగస్టీన్ చెప్పింది అవాస్తవం (ఫాలసి)కు ఉదాహరణ. ఆయన దేవుడు కూడా ఒక ప్రాణి అని, కాలంతోపాటు ఉంటాడని దేవుడు సృష్టించిన విశ్వంలో కాలం ఆయన ఆస్తి అనీ ఆయన సృష్టించినప్పుడు దేనికోసం సృష్టించాడో ఆయనకు తెలుసుననీ చెప్పాడు.

**శాస్త్రీగారి వ్యాఖ్య-** ఈ విషయంలో మనం పాశ్చాత్య ఆలోచనా పరులను అభినందించాలి. వేదం "కాలం అనేది దేవుని పీఠం అనీ దానిపై నుండే లోకాలను పరిపాలిస్తాడని చెప్పింది. కాలం శేషం. సృష్టి మొత్తం వినాశనమైనా కాలం మిగిలి ఉంటుంది కనుక శేషం అన్నారు. కనుక దేవుని సృష్టిలో మొదటిది కాలమే అని నిర్ణయమైంది. అందుకే మహర్షి వేద వ్యాసుడు విష్ణుమూర్తి కల్పాల (సృష్టుల) మధ్య విరామ కాలంలో ముడతలుగా ముడుచుకొన్న ఆదిశేషునిపై పవళించినట్లు వర్ణించాడు. ఇదే కాల చక్ర భ్రమణం అని, శేషుడు అంటే కాలం విష్ణువును సేవిస్తున్నాడని, ఆయన పడగల నీడలో హరి నిద్రిస్తున్నాడని అంతరార్థం. సృష్టి ప్రారంభించాలి అని ఆయన అనుకొన్నప్పుడల్లా కుమారుడైన బ్రహ్మను సృష్టి చెయ్యమని ఆదేశిస్తాడు. విష్ణుమూర్తి మాత్రం "పాము పడక" దిగకుండా

కాల సింహాసనంపై దర్జాగా విశ్రాంతి పొందుతూ ఉంటాడు. ఆయన అక్కడే ఉన్నాడు, ఉంటాడు. ఆయనకు ఆది అంతాలు లేవు. బ్రహ్మ సృష్టి ప్రక్రియ ప్రారంభించగానే కాలం ప్రారంభమవుతుంది. సృష్టి నశిస్తే దానితోపాటు కాలమూ సమాప్తమౌతుందని ఇదివరకు అధ్యాయాలలోనే వివరంగా చెప్పుకొన్నాం. కనుక కాలం సృష్టికి ఆస్తి.

**సమాప్తి– పేజీ 168; పేరా 1**

నువ్వొక స్పెషలిస్ట్ అయితే, అప్పటికీ, సైంటిఫిక్ సిద్ధాంతాలలో కొన్ని విషయాలు మాత్రమే నీకు తెలిసి అర్థం చేసుకోగల్గుతావు. సైన్స్ అభివృద్ధి యెంత వేగంగా ఉందంటే స్కూళ్ళలో కాలేజీ యూనివర్సిటీలలో నేర్పింది అంతా "కొంచెం" "అవుట్ ఆఫ్ డేట్" అయిపోతుంది. అంటే కాలానికి తగినది కాదనిపిస్తుంది. అతి కొద్ది మందికి మాత్రమే వేగంగా పురోగమించే జ్ఞాన సరిహద్దు (నాలెడ్జ్ ఫ్రాంటియర్) అందుకోగలరు. వారు తమ కాలాన్నంతటినీ వెచ్చించి ఇందులో కొద్ది జాగాలో మాత్రమే ప్రత్యేక నైపుణ్యాన్ని చూపగలరు. మిగిలిన జనాభాకు ఈ పురోగమనం విషయం, అది కనిపించే ఉత్సాహం భావోద్రేకం అసలేమీ తెలియదు.

**శాస్త్రీజీ మహా భాష్యం–** నిజానికి "ఎ బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైం" (కాలం సంక్షిప్త చరిత్ర) అనే స్టీఫెన్ హాకింగ్ శాస్త్రవేత్త రాసిన గ్రంథంలోని పదవ అధ్యాయంలో ఉన్న మూడు పేజీలలోని ప్రతి మాటను "యూని ఫైడ్ థీరీ ఆఫ్ ఫిజిక్స్" (యూనిఫైడ్ దీరీ ఆఫ్ యూనివర్స్)ను అన్వేషించే వారందరూ బట్టీ పట్టి జ్ఞాపకం ఉంచుకో దగినదే. దీనినే సాధారణ భాషలో "సత్యం" అంటారు. వేదం దీన్ని గుర్తించింది. నిత్య జీవిత సంగ్రామంలో సతమతమయ్యే ప్రజల దృష్టిని దీనికోసం మళ్ళించవద్దని, జీవితాన్ని సత్యాన్వేషణలో త్యాగం చేయాలనుకొన్నవారికి మాత్రమే దీనిపై శిక్షణ నివ్వాలని నిష్కర్షగా చెప్పింది. భగవంతుని సర్వ సమర్పణ చేసినవారు అవగాహన చేసుకొన్నవారు సత్య స్వభావాన్ని చేరటానికి అవగాహన సమర్థం కాదని అనుభవించటం ద్వారానే సాధ్యమని చెప్పారు. దీనికి కఠినమైన, శీలం, నైతికత, ఆధ్యాత్మిక నియమావళి కావాలి. ఈ విషయాలన్నిటినీ కేనోపనిషత్ ఒక్క వాక్యంలో చెప్పింది–

"మానవులారా– నమ్మండి– ఆత్మ తెలుసుకొన్నాను అన్నవాడికి తెలియబడదు, నాకు తెలియదు అన్న వారికి ఆత్మ తెలియబడుతుంది".

"అవిజ్ఞాతం విజానతాంః విజ్ఞానాతం అవిజ్ఞానతం"

వారిలో రెండవ వర్గంలోని జ్ఞాని– స్టీఫెన్ హాకింగ్– భగవంతుడు ఆయన్ను ఆశీర్వదించుగాక.

## పదకొండవ అధ్యాయం– విశ్వ పదార్థం ఎక్కడిది?

**పేజీ 173; పేరా 03**

నాలుగు శక్తులలో బలహీనమైనది అయినా గురుత్వాకర్షణ విశ్వ నిర్మాణాన్ని రూపొందిస్తుంది కనుక ఈ పుస్తకంలో గురుత్వాకర్షణ గురించి చెప్పే సూత్రాలకే అధిక ప్రాధాన్యమిచ్చాను.

**శాస్త్రీగారి భాష్యం–** ఇది ఎందుకంటే పురాణాలు వివిధ దేవతలను వేర్వేరు– శక్తులకు ప్రతినిధులను చేసి, తర్వాత దైవమైన గణేశునికి పేరు పెట్టాయి. ఆయనది గెలాక్సీలన్నిటినీ అఖిల నక్షత్ర మండలాలను అంటే నక్షత్ర గణాలను కలిగివున్న గజ వక్త్రంగల శరీరం. అందుకే గణేశుడు ఆయన ఎంత శక్తివంతుడు అంటే దేవతలు కూడా ఏదైనా మంచి పని చేయాలనుకొంటే, ఏదైనా సృష్టించాలంటే ముందు ఆయనను పూజించి, ప్రసన్నం చేసుకొని విఘ్నాలు రాకుండా చూసుకొంటారు. దీనిని ఆయన వ్యతిరేక శక్తుల అంటే గెలాక్సీ ఎడమ, కుడి చుట్టగా ఉన్న నక్షత్ర సముదాయాలు బాహువులుగా ఉన్నవాడని గ్రహించాలి. ఈ నక్షత్రాలు ఎడమవైపు ఉంటే కొంత ప్రభావాన్ని చూపిస్తాయి. కుడివైపు ఉంటే వ్యతిరేక ప్రభవాన్ని కలగజేస్తాయి. మొత్తం మీద ఒక ప్రభావం రెండో దానికి అది మంచి అయినా చెడు అయినా విఘ్నం కలిగిస్తుంది. ఈ అవివర్య పరిస్థితిని గుర్తించి దేవుడు కూడా ఈ విఘ్నాల విషయంలో ఏమీ చేయలేక చేతులెత్తేశాడని పురాణాలు పేర్కొన్నాయి. కాని భగవంతుని దయతో నివారింపబడని చెడు పని లేదు. అందుకనే ఆటంకాలు కలగకుండా చేయమని, దయచూపమని ముందుగానే వినాయకుని ప్రార్థిస్తారు. ఇది తర్కానికి అతీతమైన భావోద్వేగ విషయం (ఎమోషనల్). మొత్తంమీద గణేశుడు ముఖ్య విశ్వోద్భవ శక్తి (కాస్మోలాజికల్ ఫోర్స్) ఐన గురుత్వాకర్షణ దైవం. ఈ కీలక భావన వినాయక చవితి కథలో 27 నక్షత్రాలకు భర్త అయిన చంద్రుడితో పగ రూపంలో చెప్పబడింది. అలాగే భాగవతంలోని గజేంద్ర మోక్ష కథ కన్యారాశికి చెందిన హస్తా నక్షత్ర రూపమైన ఏనుగు, చివరికి మకరం (మకర రాశి) నుండి రక్షింపబడుతుంది. ఈ

ప్రతీకాత్మికతను గణేశుని ప్రార్థనలో చివరికి చెప్పే శ్లోకం ద్వారా రుజువు చేయవచ్చు. "వక్ర తుండ మహా కాయ కోటి సూర్య సమ ప్రభా- అవిఘ్నం కురు మే దేవ సర్వ కార్యేషు సర్వదా" దీని అర్థం "ఓ గణేశ దేవా! ప్రపంచాన్ని అన్నివైపుల నుంచి పాలించే తుండం కలిగి ఉన్నావు. నువ్వు కోటాను కోట్ల నక్షత్రాలు ఒకచోట చేరితే వచ్చే కాంతితో సమానమై విరాజిల్లుతున్నావు. నేను నీకు సర్వ సమర్పణమయేట్లు చేసి నేను యజ్ఞంగా భావించి నిర్వర్తించే ఏ క్రతువుకు కూడా విఘ్నం రాకుండా కాపాడు.

**పేజీ 174; పేరా 03**

ఒకవేళ ఏకీకృత సిద్ధాంతం సాధ్యమైతే, అది నియమాల ఏర్పాటు, సమీకరణాలు మాత్రమే. ఈ సమీకరణలు విశ్వాన్ని వర్ణించటానికి సాధ్యమౌతాయా? లెక్కల సూత్రాలు ఎన్ని ఉన్నా విశ్వం ఎందుకు అన్న ప్రశ్నకు, దాని వివరాలకు సమాధానం ఇవ్వగలవా? అసలు ఈ విశ్వం ఎందుకు ఇంత కష్టపడి బట్ట కట్టాలి- మనగలగాలి? ఏకీకృత సిద్ధాంతం దాని అస్తిత్వాన్ని చెప్పగలదా? విశ్వానికి సృష్టికర్త అవసరమా, ఒకవేళ అవసరమైతే ఆయన విశ్వానిపై మరేదైనా ప్రభావం చూపగలడా?

**శాస్త్రీగారి భాష్యం-** హాకింగ్ గారి మహా ప్రశ్న "ఈ విశ్వానికి పదార్థం ఎక్కడి నుంచి తేబడింది? అని. ఉపనిషత్ సాహిత్యం దీనికి చక్కని సమాధానం చెప్పింది. ఆత్మయే విశ్వానికి మూలం, ఆధారం వనరు, రూపకర్త (డిజైనర్). అదే ఉపాదాన కారణం- ఇచ్చేది విశ్వ నిర్మాణ రూపానికి నిమిత్త కారణం. మరోరకంగా సులభంగా అర్థమయ్యేట్లు చెప్పాలంటే- స్టీఫెన్ హాకింగ్ శాస్త్రవేత్త సృష్టికి సంబంధించిన అన్ని సిద్ధాంతాలను ప్రయత్నించి "దైవ చిత్తాన్ని" (మైండ్ ఆఫ్ గాడ్) తెలుసుకొనే ప్రయత్నం చేశాడు. భారతీయ అద్వైత వేదాంతం తగిన సమాధానం ఎప్పుడోనో చెప్పింది. మామూలు భాషలో చెప్పాలంటే సృష్టికి కారణం ఆత్మ మాత్రమే. తాత్వికంగా (ఫిలసాఫికల్) చెప్పాలంటే ఆత్మ సృష్టించటం లేదు. అది అలాగే ఉంది (ఇట్ జస్ట్ ఈజ్) మనం మనకున్న పరిమిత జ్ఞానంతో ఇప్పుడున్న విశ్వాన్ని దర్శిస్తున్నాం అంతే. దేవుడు లేక ఆత్మను చూసి అది సృష్టి అని పొరబడుతున్నాం. నిజానికి సృష్టికి మొదలు, తుది అనేవి లేనేలేవు. ఉదాహరణ పూర్వకంగా చెప్పాలంటే ఇంద్రధనస్సు ప్రత్యక్ష సాక్షం. వ్యక్తి ఒక ప్రత్యేక స్థానంలోని బిందువు వద్ద ఉండి, నిర్ణీత దిశలో ఉన్న సూర్యుని చూస్తేనే ఇంద్రధనస్సు కనిపిస్తుంది. వ్యక్తి కదిలిన, లేక సూర్యుడు కదిలిన క్షణంలో అది కనిపించదు అన్నది మన అనుభవమే.

సృష్టి కూడా అలాంటిదే. రజ్జు సర్ప భ్రాంతిలో మనం పొరబడుతున్నాం. ఈ విషయాలు పూర్వపు అధ్యాయంలోనే మనం చెప్పుకొన్నాం. "దిమైండ్ ఆఫ్ గాడ్" అంటే దైవ చిత్తం లేక దేవుని మనసు అంటే అర్థం– దేవుడు ఈ విశ్వంగా కనిపించటమే.

కాని దేవుడికి ఆది, అంతం లేవు. దీన్ని అందరూ అంగీకరించారు. విశ్వానికి కూడా ఆద్యంతాలు లేవు. గణితం, తర్కం ఆధారంగా వాదిస్తే– " అవి రెండూ ఒకటి కావా? అవును రెండూ ఒకటే. ఇదే స్వామీ అద్వైత సిద్ధాంతం. హాకింగ్ గారి "ది మైండ్ ఆఫ్ గాడ్" అంటే ఇదే– దైవ చిత్తం– దేవుని మనసు.



